
Pick a PINKY...
and let
your writing
sparkle...
PINKY
LION
PINKY
the Prettiest Pencil
in town.

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి. పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి

4 మాసాలు నించి

6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008

Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''మారణాయుధం''] కు ఆధారం, జొన్నలగడ్డ రత్న రచన. ఇతరుల మనసు నొప్పించకుండా మాట్లాడగలగడం కేవలం విద్యా, సంస్కారాలవల్ల లభ్యమయ్యే లక్షణం కాదు. పుల్ల విరుపుగా మాట్లాడే పండితులనే గాక, ఎంతోమాట మంచితనం గల విద్యాగంధం లేనివాళ్ళను కూడా మనం చూస్తూంటాం. ''తథాస్తుదేవతలు'' అన్న కథ వ్యంగ్యధోరణిలో, ఈ సత్యాన్ని బోధిస్తుంది.

## అమరవాణి

అపరాధో న మేస్తీతి, నైతద్ విశ్వాస కారణమ్,
విద్యతే హి నృశంసే భ్యో, భయం గుణవతామపి.

[తాము ఎవరికీ అపకారం చేయలేదు కాబట్టి, తమకు ఎలాంటి హాని కలగదని విశ్వసించడం క్షేమం కాదు. మంచివాళ్ళుగా ఉన్నప్పటికీ, దుర్మార్గులపట్ల జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.]

సంపుటి 83 అగస్టు '88 సంచిక 2

విడి ప్రతి : 2–50 :: సంవత్సర చందా : 30–00


Lakhani
Study time.... Play time.... Any time....
Lakhani Canvas Shoes
For comfort, easy wear and long-lasting quality.
3 Brothers LC 4088
Super Joy
Super Tennis
Samrat
Target
Nicky
We think quality... we make quality... you get quality.
Lakhani
The Footwear People

# నీతివంతుడు

ఒకానొక రాజు, వృద్ధుడైన మంత్రి చనిపోతే, ఆయన కుమారుడికి ఆ పదవి యిచ్చాడు. కొత్త మంత్రి ఉద్యోగబాధ్యత స్వీకరించిన రోజునే, రాజు కొక సమస్య ఎదురైంది. రాజ్యంలో శిస్తు వసూళ్ళు చేసే ఉద్యోగి, ఆ డబ్బుతో పరాయి రాజ్యానికి పారిపోయాడు.

"ఈసారి మనం ఆ ఉద్యోగం యివ్వబోయేముందు, వచ్చిన వా డేపాటి నీతివంతుడో తెలుసుకోవాలి. కాని, అదెలా సాధ్యం? మీ నాన్నగారైతే, తగిన ఉపాయం ఆలోచించేవాడు," అన్నాడు రాజు, కొత్త మంత్రితో.

"ప్రభూ, చాటింపు వేయించండి. ఆ వచ్చినవాళ్ళలో నీతివంతుణ్ణి, మీకు చూపగలను," అన్నాడు మంత్రి.

చాటింపు విని పదిమంది వచ్చారు. మంత్రి వాళ్ళను ఒక చీకటి గది గుండా రాజు దగ్గిరకు రమ్మని చెప్పాడు. వాళ్ళు అలాగే చేశారు.

అప్పుడు మంత్రి వాళ్ళతో, "కారణం తర్వాత చెబుతాను. నా చుట్టూ వేగంగా పదిసార్లు ప్రదక్షిణ చేయండి," అన్నాడు.

ఒక్కడు తప్ప, మిగతా తొమ్మిదిమందీ అలా చేయడానికి నిరాకరించారు. మంత్రి వాణ్ణి, రాజుకు చూపి, "ప్రభూ, యితను నీతివంతుడు. ఉద్యోగంలో నియమించండి," అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ చూశాడు. మంత్రి ఆయనతో, "వీళ్ళు నడిచివచ్చిన చీకటి గదిలో, రెండుచోట్ల మెరిసే వెండినాణాలు కుప్పగా పోయించాను. ఈ తొమ్మిదిమందీ వెండి నాణాలను దుస్తుల్లో దాచుకున్నారు. వేగంగా కదిలేటప్పుడు వాటి శబ్దం వినబడి, తమ దొంగతనం బయటపడుతుందని, ప్రదక్షిణ చేయడానికి నిరాకరించారు," అని చెప్పాడు.

వాళ్ళను పరీక్షించగా, మంత్రి చెప్పింది నిజమని రుజువయ్యింది. రాజు మంత్రి చూపిన నీతివంతుణ్ణి ఉద్యోగంలో నియమించాడు.

—రావులపాటి ప్రసాద్.





# తథాస్తు దేవతలు

గోపవరం గ్రామంలో నరసింహం అనే చిన్నరైతు వుండేవాడు. ఆయన భార్య పేరు భానుమతి. నరసింహం నోరెత్తితే తిట్లువచ్చేవి. పెళ్ళయిన కొత్తలో భానుమతి, భర్త తిట్లకు బెదిరిపోయి జ్వరం తెచ్చుకున్నది.

ఒక ఏడాది గడిచాక, ఆమె భర్తను అంతగా తిట్టవద్దని బతిమాలింది. నరసింహం కళ్ళెర్రచేసి, "నీ నోరుపడ! మళ్ళీ మరోసారి యిలా అడిగావో ఒళ్ళు హూనం చేస్తాను," అన్నాడు.

తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టడంలో, నరసింహం ఘనతను ఊరంతా కథలుగా చెప్పుకునేవాళ్ళు.

ఒక సంవత్సరం నవరాత్రి ఉత్సవాలలో, ఊరి మధ్యగల దుర్గగుడి ముందు హరికథా కాలక్షేపం ఏర్పాటు చేశారు.

ఆ రాత్రి భోజనం వేళప్పుడు నరసింహం, భార్యతో, "ఒసే, జిడ్డుమొహం. త్వరగా వడ్డిస్తే, వెళ్ళి కథా కాలక్షేపం చేసి వద్దాం," అన్నాడు.

భానుమతి గబగబా భర్తకు వడ్డించింది. నరసింహం భోజనం చేసి, ముందు గదిలో వున్న మంచం మీద కూర్చుని, "త్వరగా తెములు. అవతల కథ మొదలవుతుంది, బద్ధకపుపీనుగా!" అంటూ కేకపెట్టాడు.

భానుమతి త్వరత్వరగా అన్నంతిని, వంటిల్లు సర్దుకోసాగింది. దుర్గగుడి దగ్గర జనం చేసే కోలాహలం ఆగిపోయి, హరిదాసుగారి కంచుకంఠం వినిపించసాగింది: "నోరు వున్నది కమ్మగా తినడానికి, తీయగా మాట్లాడడానికి. అంతే గాని, కఠోరంగా తిట్టుకోవడానికి కాదు. తిట్టేముందు మంచీ—చెడూ చూసుకో

మాచిరాజు కామేశ్వరరావు



వాలి. తథాస్తుదేవతలు వుంటారు. వాళ్ళు తథాస్తు అంటే, మనం తిట్టినతిట్టు నిజంగా జరిగిపోతుంది. అందువల్ల, సాధ్యమైనంత వరకు మంచే మాట్లాడాలి!''

నరసింహానికి హరిదాసు మాటలు వినిపించాయి. అతడు మంచం మీది నుంచి లేచి, ''ఇంకా వంటగదిలోనే అఘోరిస్తున్నావా, మొద్దూ'' అంటూ భార్యను కసిరాడు.

''ఇదుగో, మొహం కడుక్కుని వచ్చేస్తాను,'' అంటూ భానుమతి బావి దగ్గిర నుంచి జవాబిచ్చింది.

''నీ మొహం మండ! ఎప్పుడూ అలస్యమే,'' అన్నాడు నరసింహం.

ఆ మరుక్షణం పెరట్లో నుంచి ఘొల్లు మంటూ శోకాలు ప్రారంభించింది, భానుమతి.

''మొహం మండిపోతున్నది, బాబోయ్! భరించరాని మంటలు, దేవుడోయ్!'' అంటూ ఆమె మొహం మీద నీళ్ళు చల్లుకుంటూ కేకలు పెట్టసాగింది.

భానుమతి మొహం మంట ఎంతసేపటికీ తగ్గకపోయేసరికి, నరసింహం ఆమెను వెంటబెట్టుకుని దగ్గిరలో వున్న వైద్యుడింటికి వెళ్ళాడు.

''ఆయన భోజనం చేస్తున్నారు. ఇప్పుడే వస్తారు, కూర్చోండి!'' అన్నది వైద్యుడి భార్య.

భార్యాభర్త లిద్దరూ అరుగు మీద కూర్చున్నారు. భానుమతి మొహం మంట భరించలేకపోతున్నది. పదీపదిహేను నిమిషాలు గడిచినా వైద్యుడు బయటికి రాలేదు.

ఇది చూసి నరసింహం మండిపడుతూ, భార్యతో, ''వీడు వైద్యుడా, బకాసురుడా! ఎంతసేపు తింటాడు? త్వరగా బయటికి వచ్చి కూలబడడేం,'' అన్నాడు.

ఆ మరుక్షణం వైద్యుడు గబగబా బయటికి వచ్చి, అరుగుపక్కన కూలబడి పోయి మూలగసాగాడు. వైద్యుడి భార్య శోకాలు అరంభించింది.

నరసింహం భార్యను తీసుకుని, మరొక వైద్యుడి యింటికి వెళ్ళాడు. ఆ వైద్యుడు, భానుమతి మొహంలోకి చూసి, నరసింహంతో, "ఒక పాతికరూపాయ లివ్వు!" అన్నాడు.

నరసింహం తెల్లబోయి, "ముందు రోగిని పరీక్షించండి," అన్నాడు.

వైద్యుడు మౌనంగా, అక్కడ గోడకు వేళ్ళాడుతున్న ఒక చెక్కబల్ల కేసి వేలు చూపి, అవతల ఏదో ముఖ్యమైన పని వున్నవాడిలా తిన్నగా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ చెక్కబల్ల మీద యిలా రాసి వున్నది: రోగిని చూస్తే పాతికరూపాయలు, పరీక్ష చేస్తే యాభై, చికిత్సకు వంద.

నరసింహం జేబులోంచి పాతిక రూపాయిలు బైటికి తీస్తూ, "ఏడి అమ్మ కడుపుకాల! వైద్యాన్ని వ్యాపారం చేశాడు," అంటూ కోపంతో పళ్ళు కొరుక్కున్నాడు.

అంతలో వైద్యుడు వచ్చి, పాతిక రూపాయిలు తీసుకుని, భానుమతిని పరీక్షించబోతూండగా, లోపలి నుంచి ఆయన తల్లి, "ఒరే, బాబూ త్వరగా రా నా కడుపు పెనంలా కాలిపోతున్నది," అంటూ కేకపెట్టింది.

ఆ కేక వింటూనే వైద్యుడు లోపలికి పరిగెత్తాడు. నరసింహం ఒక పావుగంట చూసి, భార్యతో, "వీడు వైద్యుడో, వ్యాపారో తెలియడం లేదు. మరొకచోటుకు





వెళదాం పద,'' అంటూ జేబులో మిగిలిన నలభైరూపాయిలను బయటికి తీసి చూసుకుని అక్కడి నుంచి బయలుదేరాడు.

నరసింహానికి, అతడి స్నేహితుడు శేషాచలం ఎదురుపడ్డాడు. వైద్యానికి మరి కొంత డబ్బు అవసరం అవుతుందేమో అనుకుంటూ, నరసింహం, స్నేహితుణ్ణి ఆపి, ''నీ దగ్గిరేమన్నా డబ్బుంటే యివ్వు. తెల్లవారగానే తెచ్చి యిస్తాను,'' అన్నాడు.

శేషాచలం బాధపడుతున్నవాడిలా ముఖంపెట్టి, ''చాలా అవసరం అయి అడిగుంటావు. కాని, సమయానికి నా దగ్గిర దమ్మిడీ లేదు,'' అని ముందుకు సాగాడు.

''డబ్బువుండీ, మనకులేదంటున్నాడు, దొంగవెధవ!'' అన్నాడు నరసింహం, భార్యతో.

ఆ మరుక్షణం శేషాచలం వెనుతిరిగి వచ్చి, నరసింహం మెడపట్టుకుని, ''నీ దగ్గిర వున్న డబ్బంతా యిచ్చెయ్యి. అలా చేయకపోయావో, నీ ప్రాణానికేముప్పు,'' అన్నాడు గట్టిగా పళ్ళు కొరుకుతూ.

నరసింహం వణికిపోతూ, తన దగ్గిర వున్న డబ్బును శేషాచలానికి యిచ్చివేశాడు.

భానుమతి యిదేమీ పట్టించుకోకుండా, ''నా మొహం మండిపోతున్నది, బాబో!'' అంటూ అరవసాగింది.

ఆసరికి బాగా విసిగిపోయివున్న నరసింహం, భార్య భుజం గట్టిగా పట్టుకుని, ''మరొక దిక్కుమాలిన వైద్యుడెవడైనా దొరుకుతాడేమో అని, నిన్ను తీసుకుపోతున్నాను. ఊరికే అరవకే, రాక్షసీ!'' అన్నాడు.

ఆ వెంటనే భానుమతి రాక్షసిగా మారిపోయింది. నరసింహం కెవ్వుమంటూ అరిచి పరిగెత్తసాగాడు. రాక్షసిరూపంలో వున్న భానుమతి, అతడి వెంటబడి తరమసాగింది.

ఆ విధంగా వాళ్ళు ఊరుదాటి, ఒక మామిడితోట లోంచి పరిగెత్తుతూండగా,

నరసింహం వెనుదిరిగి చూశాడు. అతడికి భార్య కనిపించలేదు. ఇద్దరు దేవతలు అతడి కేసి వస్తూ కంటబడ్డారు.

నరసింహం భయాశ్చర్యాలతో, "ఎవరు మీరు?" అని వాళ్ళను అడిగాడు.

"మేము తథాస్తుదేవతలం!" అన్నారు వాళ్ళు.

ఇంతవరకూ, తను తిట్టిన తిట్లన్నీ ఒక్కటి తప్పకుండా నిజం కావడానికి కారణమేమిటో నరసింహానికి ఇప్పటికి అర్థమైపోయింది.

అతడు దూరంగా తనకేసి పరిగెత్తుకు వస్తున్న రాకసిని, వాళ్ళకు చూపుతూ, "నా తప్పులను క్షమించండి. ఇక నోటికి వచ్చిన తిట్లన్నీ తిట్టడం మానుకుంటాను. నా మీద దయచూపి నా భార్యకు, ఆ రాకసిరూపం నుంచి విముక్తి కలిగించండి!" అంటూ తథాస్తుదేవతల కాళ్ళ మీద పడ్డాడు.

"తథాస్తు! నీ భార్యకు రాకసిరూపం నుంచి విముక్తేకాదు, ఈ క్షణం నుంచి రాక్షసుడి లాంటి భర్త నుంచి కూడా విముక్తి కలిగింది. ఉత్తపుణ్యానికి తిట్టే వాళ్ళంటే, ఎదుటివాళ్ళకు భయం వుండొచ్చుకానీ, గౌరవం, ప్రేమాలాటివి వుండవు. ఆ సంగతి బాగా గుర్తుంచుకో!" అంటూ తథాస్తుదేవతలు మాయం అయారు.

రాకసిరూపం పోయిన భానుమతి, భర్త దగ్గిరకు వచ్చి, "మీరెందుకలా దిక్కులు చూస్తూ వణికిపోతున్నారు? మనం ఊరువిడిచి—యింతదూరంలో వున్న మామిడితోటలోకి, యీ అర్ధరాత్రి వేళ ఎందుకు వచ్చాం?" అని అడిగింది ఆశ్చర్యపోతూ.

"అదంతా తర్వాత చెబుతాలే. ముందు ఇంటికివెళదాంపద," అంటూ నరసింహం బయలుదేరాడు.

తను అడిగినదానికి, "నోరు మూయవే దరిద్రగొట్టుదానా!" అని భర్త తిట్టనందుకు మురిసిపోతూ, భానుమతి భర్త వెంట నడిచింది.





# ముని-వేటగాడు

ఒకానొక అరణ్య సమీపంలోని గ్రామంలో, ఒక వేటగాడుండేవాడు. వాడు, అరణ్యంలోని జంతువులను నిర్దయగా వేటాడి జీవించేవాడు. అందుచేత, ఆ చుట్టు పక్కల గ్రామాల వాళ్ళందరూ వాణ్ణి నిర్దయుడు అని పిలిచేవారు.

ఒక రోజున వేటలో, వాడికి ఒక్క జంతువు కూడా దొరకలేదు. వాడు అరణ్యమంతా గాలించి, ఎలాగో ఒక లేడిపిల్లను వేటాడగలిగాడు. దాన్ని భుజాన వేసుకుని, వాడు ఇంటికి తిరిగి వస్తున్నాడు.

దారిలో వాడికి ఒక ముని కనిపించి, "ఇలారా, నాయనా!" అని పిలిచాడు అప్యాయంగా.

నిర్దయుడు, మునిని సమీపించి, "ఏమిటి, స్వామీ?" అని అడిగాడు, వినయంగా.

"ఆ గాయాలతో బాధపడుతున్న లేడి పిల్లను, నేల మీద పడుకోబెట్టు," అన్నాడు ముని.

నిర్దయుడు, లేడిపిల్లను నేల మీద పడుకోబెట్టగానే, ముని తన కమండలంలోని జలాన్ని దాని మీద చల్లాడు.

వెంటనే లేడిపిల్ల మానవభాషలో, "అయ్యా, దయచేసి నన్ను వదిలిపెట్టు. లేకలేక కలిగిన నా కోసం, నా తలిదండ్రులు ఏడ్చి ఏడ్చి, యీసరికి సొమ్మసిల్లిపోయుంటారు. అయినా, పుత్రవాత్సల్యం ఎలాంటిదో, నీవు ఎరగంది కాదు గదా! నీ బిడ్డ కనిపించకపోతే, నువ్వు నిద్రపోగలవా?" అని నిర్దయుణ్ణి అడిగింది.

ఆ మాటలు వినేసరికి, నిర్దయుడికి తన బిడ్డలు గుర్తుకు వచ్చారు. ఇంత నిర్దయగా తాను రోజూ తప్పకుండా జీప

మల్లవరపు మనోహరరెడ్డి

హింస చేస్తున్నది, తన బిడ్డలకొరకే. తన బిడ్డలు తనకెంతో, ఇతర్లకు కూడా తమ బిడ్డలు అంతేకదా !

ఇలా ఆలోచించి నిర్దయుడు, లేడిపిల్ల కట్టువిప్పి, ఏదో ఆకుపసరుతో బాణం గాయానికి చికిత్సచేసి, దాన్ని అరణ్యంలో వదిలిపెట్టి, ఇల్లు చేరాడు. ఆ రోజు ఇంట్లో అందరూ వస్తుపడుకోవలసి వచ్చింది.

మర్నాడు వాడు, ఒక దుప్పిని వేటాడి భుజాన వేసుకుని వస్తూండగా, మళ్ళీ ముని కనిపించి, నిర్దయుణ్ణి దగ్గిరకు పిలిచి, కమండలంలోని జలాన్ని దుప్పి మీద చల్లాడు.

వెంటనే దుప్పి మానవభాషలో, "అయ్యా, నిండుచూలుతో కదలలేని స్థితిలోవున్న, నా భార్యకు ఆహారం కోసం తిరుగుతున్న నన్ను వేటాడడం ధర్మమేనా ? సాటిప్రాణిగా ఆలోచించు!" అన్నది.

తన భార్య గర్భవతిగా వున్నప్పుడు, తాను ఎలా పరితపించిందీ గుర్తుకు వచ్చి, నిర్దయుడు దుప్పిని వదిలిపెట్టేశాడు. తర్వాత వాడు ఇల్లు చేరేసరికి, ఆకలి బాధకు నీరసించి, కాంతిలేని కళ్ళతో తనకోసం ఆశగా ఎదురుచూస్తున్న భార్యాబిడ్డలు కనిపించారు.

వాళ్ళను చూసేసరికి నిర్దయుడి గుండె కరిగిపోయింది. వాడు విరక్తితో అరణ్యంలోకి తిరిగివచ్చి, మునిని కలుసుకుని, "స్వామీ, మీవల్ల నాకు దయాదాక్షిణ్యాలు



అలవడ్డాయి. అందుచేత వేటాడలేక, నా బిడ్డలను పస్తులతో చంపుకుంటున్నాను. ఆ ఘోరం చూడలేక, దీనికంతకూ కారణం అయిన మీ ఎదటే ఉరిపోసుకుని చావాలని ఇక్కడికి వచ్చాను,'' అన్నాడు.

దానికి ముని మందహాసం చేసి, ''నా ఉద్దేశం నిన్ను జీవహింస మానమనేగాని, పస్తులతో చావమనికాదు. ఈ ప్రపంచంలో నువ్వు బతకడానికి వేట ఒకటే మార్గమనుకుంటున్నావేమో, అది పొరబాటు!'' అన్నాడు.

''మరేదైనా మార్గముంటే, మీరే సెలవివ్వండి, స్వామీ!'' అని నిర్దయుడు చేతులు జోడించాడు.

అప్పుడు ముని, వాడికి ఆశ్రమం దాపుల మేస్తున్న కొన్ని ఆవులను చూపి, "వాటిలో మూడుపాడి ఆవులను తోలుకుపో. వాటికి చక్కగా పోషణచెయ్యి. అవి యిచ్చే పాలమ్మితే, నీకు హాయిగా రోజులు ఎందుకు గడిచిపోవు?'' అన్నాడు.

ముని మాటలకు సంతృప్తి చెందిన నిర్దయుడు, మూడుపాడి ఆవులతో గ్రామం చేరాడు.

వేటగాడు పాడి ఆవులతో అరణ్యం నుంచి తిరిగి రావడం చూసి, గ్రామస్థులంతా ఆశ్చర్యపోయారు.

నిర్దయుడు వారికి జరిగిందేమిటో చెప్పి, ''ఈనాటితో నేను జీవహింస మానేస్తున్నాను!'' అన్నాడు.

ఇందుకు గ్రామస్థులు ఎంతగానో సంతోషించారు. వాళ్ళల్లో కొందరు, వాడికి పశువులపాక కట్టుకునేందుకు అవసరమైన వెదురువాసాలు యిచ్చారు. మరి కొందరు పశుగ్రాసం యిచ్చారు.

ఈ విధంగా వేటగాడైన నిర్దయుడు పశుపోషకుడుగా మారిపోయాడు. వాడూ, వాడి భార్యాబిడ్డలూ పాడి ఆవులసంరక్షణలో ఎలాంటి లోటుపాట్లూ జరక్కుండా చూసుకుంటూ, వాటి పాలను దగ్గరవున్న పట్టణంలో అమ్మి హాయిగా జీవించసాగారు.






## 10

[బంగారులోయ రాజ్యానికి వచ్చిన మాంత్రికుడు, రాజును మోసంతో బంగారు విగ్రహం వెనక ఉన్న గుహలో బంధించి, రాజు దుస్తులూ, ఆభరణాలూ తాను ధరించి వెలుపలికి వచ్చాడు. వింత జలపాతం దాటి వెళ్లిన వినోదుడు, ముని సహాయంతో మానవలోక సరిహద్దు ప్రాంతంలో వున్న స్వప్నభూమిని చేరుకుని, అక్కడ ఒక వింతదృశ్యం చూశాడు.—తరవాత]

దాపులనున్న చిన్న అగాధంలో వికార స్వరూపు డొకడు, చేతిలో పొడవాటి గొట్టం పట్టుకుని ఉన్నాడు. వాడికి ఎదురుగా పెద్ద బంతి ఆకారంలో ఒక వస్తువు ఉన్నది. వాడి చేతిలోని గొట్టం కొస ఆ బంతికి తగిలించబడి ఉన్నది. వాడు గొట్టం రెండవ కొసను పళ్ళతో బిగించి ఊదుతున్నాడు. వాడలా ఊదేప్పుడు వాడి నోటిలో వింత కాంతి ప్రకాశిస్తున్నది.

ఆ బంతి కొంతసేపటికి రక్తం లాగా ఎర్రగానూ, మరి కొంతసేపటికి కాటుకలా నల్లగానూ మారి, ఒక విధమైన పొగను వెలికి చిమ్మింది. వాడు ఆనందంతో ముందుకువంగి ఆ పొగను ఆత్రంగా పీల్చసాగాడు. వాడి కళ్ళు గుడ్లగూబ కళ్ళులాగా మెరుస్తున్నవి.

''ఏమిటా వింత దృశ్యం ?'' అని అడిగాడు వినోదుడు మునిని.

మనోజ్ దాస్



ఆనందంతో పొంగిపోతారు. అలా చూడు వాడెలా మురిసిపోతున్నాడో!'' అన్నాడు ముని.

వినోదుడు మళ్ళీ అగాధం కేసి చూశాడు. ఆ వికారస్వరూపుడు పరమానందంతో పొగను పీలుస్తూ, పందిలాగా గుర్రుపెడుతున్నాడు. వాడు పొగను పీల్చేకొద్దీ కడుపు పెద్దదై బానలా తయారయింది. అయినా, వాడు పొగను పీల్చడం మానడం లేదు. క్రమంగా వాడి ముఖంలో ఆనందానికి బదులు చెప్పరాని బాధ చోటు చేసుకున్నది.

"వాడేదో బాధ అనుభవిస్తున్నట్టున్నదే!" అన్నాడు వినోదుడు.

''ఈ అగాధం స్వప్నభూమిలో ఒక భాగం. భూమి మీది ప్రజలు కనే కలలు ఇక్కడ ప్రతిబింబిస్తాయి. ఒకే రకం కలలు కుదింపబడి ఒక రూపంగా ఏర్పడతాయి. ఇప్పుడు నువ్వు చూస్తున్నది కొన్ని వేల కలల సంక్షిప్తస్వరూపం. తమను తెలివిగలవాళ్ళమనుకునేపరమమూర్ఖులు కనే కలల సంక్షిప్తరూపం ఇది. అలాంటి కలలు కనేవాళ్ళు ప్రపంచాన్ని విషమయం చేస్తారు. ధనార్జనకోసం అడ్డదారులు తొక్కుతారు. ఆహారపదార్థాలు కల్తీ చేస్తారు. అక్రమంగా ధరలు పెంచి అమాయక ప్రజలను దోచుకుంటారు. ఏవో లాభాలు గడించినట్టు ఆ సమయానికి

''అవును, చెప్పరాని బాధను అనుభవిస్తున్నాడు. ఎదుటివాళ్ళ మంచి కోరని పాపిష్ఠివాళ్ళ కందరికీ ఇటువంటి గతే పడుతుంది. అలాంటి వాళ్ళు మంచి గాలిని పీల్చలేరు,'' అన్నాడు ముని.

కొంతసేపటికి వాడు కిందపడి విలవిలా తన్నుకోసాగాడు. వినోదుడు ఇక వాడి కేసి చూడలేక, తన చూపులను అగాధం చివరికి మరల్చాడు.

అక్కడ నేల మీది నుంచి వింత కాంతిరేఖలు బాణాల్లా పైకి దూసుకు వస్తున్నాయి. ఆ కాంతిరేఖలను అనుకుని ఒక బ్రహ్మాండమైన వటవృక్షం ఉన్నది.

కొన్ని కాంతిరేఖలు ఆ వృక్షం సగంవరకే వెళ్ళి కాంతిని కోల్పోతున్నవి. ఒకే ఒక కాంతిరేఖ మాత్రం వృక్షం చిటారు కొమ్మలదాకా ఎగబ్రాకుతున్నది. అయినా, రాబందులవంటి వింతపక్షులు కొన్ని కాంతిరేఖను పైకి పోనీయకుండా రెక్కలతో విసురుతూ ఆర్పేస్తున్నవి!

"అక్కడి కాంతులు ప్రజల శాంతి సౌఖ్యాలు కోరేవాళ్ళ కలలకు సంకేతాలు. శక్తిహీనులు కనే కలలు ఫలించకుండా సగంలోనే ఆగిపోతాయి!" అన్నాడు ముని.

"కాంతిరేఖను ఎగబ్రాకనీయకుండా ఆ పక్షులు ఎందుకు ఆటంకపరుస్తున్నవి?" అని అడిగాడు వినోదుడు.

"ప్రజలు శాంతి సౌఖ్యాలతో జీవించడం చూసి సహించలేని దుష్టశక్తులకు సంకేతాలు ఆ పక్షులు. ఆ దుష్టశక్తులను అధిగమించాలంటే మరింత పట్టుదలతో, ధైర్యసాహసాలతో పోరాడాలి." అని వివరించిన ముని, కొంతసేపు మౌనం వహించి, "ఇప్పుడు మనం సంతృప్త శాంతభూమిని ప్రవేశించాలి. అందుకు ఈ అగాధాన్ని ఒక్క అంగలో దాటాలి. నువు దాటగలవా?" అని అడిగాడు ముని.

"తమ కరుణవుంటే తప్పక దాటగలను," అన్నాడు వినోదుడు.

"మంచిది. ఆ నమ్మకం వుంటే చాలు—ఎంతటి ఘనకార్యాన్నయినా





సాధించవచ్చు. ఇలా వచ్చి, నా చేయి పట్టుకుని, కళ్ళు మూసుకుని, బలాన్నంతా కూడదీసుకుని నాతో పాటు ముందుకు దూకు,'' అని వినోదుడి చేయిపట్టుకున్నాడు ముని.

వినోదుడు కళ్ళు మూసుకుని, ముని చెప్పినట్టే, బలంకొద్దీ ముందుకు దూకాడు. వానచినుకులా ఎంతో తేలికగా అవతలి గట్టుమీదపోయి వాలాడు వినోదుడు. కళ్ళు తెరిచి చుట్టూ కలయజూశాడు. కనుచూపు మేరకు అందాల ఉద్యానవనం. దూరంగా వింత వింత రంగులతో ఇంద్రధనుస్సు తళతళ మెరుస్తున్నది. పక్షులు కలకలా రావాలు చేస్తున్నవి. మేఘాలు తలకు చేరువగా రంగురంగుల పుష్పాల్లాగా తేలుతున్నవి. మెల్లమెల్లగా వీచే పిల్లగాలులు వినోదుడికి ఎంతో హాయిని కలిగించాయి. అతడు ముని కోసం చుట్టుపక్కల కలయజూశాడు. ముని జాడలేదు. మామూలుగా అయితే ముని కనిపించక పోతే, వినోదుడు విచారగ్రస్తుడయ్యేవాడే. అయితే, ఇప్పుడతనిలో ఎలాంటి విచారమూ లేదు. అక్కడి వాతావరణం విచారానికి అతీతమైనదని వినోదుడు గ్రహించాడు. ఆ ప్రశాంత వాతావరణానికి అతని మనసు పులకరించింది. అప్పుడతడు తను బాల్యంలో నేర్చుకున్న పాటలను మధురంగా ఆలపించసాగాడు. కొంత సేపటికి సూర్యోదయమయింది. వినోదుడు పాటపాడుతూ పక్కకు తిరిగి చూశాడు. అతని పక్కనే అపురూప సౌందర్యవతి అయిన ఒక యువతి కూర్చుని వున్నది! వినోదుడు పాడడం ఆపి, ఆమె కేసి వింతగా చూడసాగాడు.

''దయచేసి పాట ఆపకు. పాడు, పాడు,'' అని ప్రాథేయపడిందా యువతి.

వినోదుడు ఆమె కేసి చూస్తూ కొంత సేపు అలాగే ఉండిపోయాడు. ఆ తరవాత, ''చాలా వింతగా ఉన్నదే!'' అన్నాడు వినోదుడు తనలో తాను అనుకుంటున్నట్టు.



"ఏది వింత?" అని అడిగిందామె చిన్నగా నవ్వుతూ.

"నిన్ను మొట్టమొదటిసారిగా ఇప్పుడే నేను చూస్తున్నాను. అయినా నీ నవ్వు నాకు చిరపరిచితంగా తోస్తున్నది. నువ్వెప్పుడయినా, మా బంగారులోయ రాజ్యానికి వచ్చావా?" అని అడిగాడు వినోదుడు.

ఆ యువతి కిలకిలా నవ్వుతూ, "లేదు; ఈ సుందరమైన లోయను వదిలి వెళ్ళవలసిన అవసరం నాకెప్పుడూ కలగలేదు. నీకీలోయ అందంగా కనిపించడం లేదా?" అన్నదామె.

"అందంగా కనిపించడమా! ఇంత కన్నా సుందరమైన ఉద్యానవనాన్ని నేను ఊహించనైనా ఊహించలేను. అయినా, ఇప్పుడు నాకొక విషయం స్ఫురణకు వస్తున్నది. నేను తరచూ మా రాజధాని నగరాన్ని వదలి అరణ్యాలకు పోయి అక్కడి పొదలమధ్యా, శిథిలాలమధ్యా ఆడుకుంటూ కాలక్షేపం చేసేవాణ్ణి. ఆ సమయంలో మేఘాల మధ్య నుంచి దిగి వచ్చినట్టుగా ఆకాశం నుంచి అప్పుడప్పుడు ఒక వింతపక్షి వచ్చి, ఒక చెట్టు కొమ్మ మీద వాలి, 'సుదూరతీరంలో ఉన్న దొక యువరాణి....యువరాణి!' అని మధురంగా పలికేది. అప్పుడు నా కళ్ళముందు చిరునవ్వులుచిందే ఒక యువతి ముఖం లీలగా కదలాడేది. నిన్ను చూస్తూంటే ఆ యువతి ముఖమే జ్ఞాపకం వస్తున్నది," అన్నాడు వినోదుడు.

"అలాగా! నేనేమో ఈ భూమికి యువరాణినే. నేను నిద్రిస్తున్నప్పుడు తరచూ నాకొక గీతాలాపన వినిపించేది. ఆ గీతమూ, నువ్విప్పుడు పాడినపాటా ఒక్కలాగే ఉన్నవి. నేను కూడా అలా పాడడానికి ఎంతగానో ప్రయత్నించాను. అయినా సాధ్యపడలేదు. ఈ భూమికి అవతల ఒక దేవత ఉన్నదనీ, ఆ దేవత నుంచి వరం పొందితే తప్ప అలా పాడ జాలమనీ పెద్దలు చెప్పారు. అయినా, ఇక్కడి వాళ్ళెవ్వరూ ఆ దేవత దర్శనానికి

వెళ్ళడం సాధ్యపడదు,'' అన్నది యువ రాణి ఎంతో విచారంగా.

''నేను కేవలం పాటే కదా పాడుతున్నాను,'' అన్నాడు వినోదుడు.

''అవును పాటే! నీలాగా జీవితంలో ఒక్కసారి పాడితేచాలు; నా జన్మ ధన్యమయినట్టే భావిస్తాను!'' అన్నది యువ రాణి.

''నీ కంఠస్వరం ఎంతో మధురంగా ఉన్నది. అయినా నువ్వెందుకు పాడలేవు?'' అని అడిగాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''నేనే కాదు. ఇక్కడ వున్న ఏ ఒక్కరూ పాడలేరు. అలా పాడే భాగ్యం మాకు లేదు. అయితే, నేను తప్ప ఈ భూమిలో ఎవరూ పాడాలని కోరుకుంటారనుకోను,'' అన్నది యువరాణి.

వినోదుడు ఆశ్చర్యపడుతూ ఒక బండ మీద కూర్చున్నాడు. యువరాణి ఎదురుగా కూర్చున్నది. ఆమె రూపం రూపుదాల్చిన దివ్యగీతం లాగున్నది. అయినా, పాపం ఆమె పాడలేదు!

అక్కడివాళ్ళు మామూలు మనుషులు కారని ముని చెప్పిన విషయం వినోదుడికి జ్ఞాపకం వచ్చింది. మనిషికి తప్ప మరే ప్రాణికీ మాట్లాడేశక్తి లేదు. అయినా మనుషులు చక్కగా మాట్లాడడానికి చేత



గాక, తరచూ పాముల్లాగా బుసకొడతారు; కోతుల్లాగా కీచులాడుకుంటారు. ఇంకా కొందరయితే, మాట్లాడుతున్నామనుకుని కుక్కల్లాగా మొరుగుతారు—అని ముని ఒకసారి తనతో అన్న మాటలు అతని మనసులో కదలాడాయి.

మిగతా ప్రాణులకన్నా మానవులెంత అదృష్టవంతులో అతనికి అర్థమయింది. మానవులు హాయిగా నవ్వగలరు. అందంగా పాడగలరు. ఎన్నెన్నో అద్భుతాలు సాధించగలరు. అయినా తమలోని అజ్ఞానం కొద్దీ తమశక్తులను సక్రమంగా వినియోగించుకోలేకపోతున్నారన్న ముని మాట ఎంతో వాస్తవమనిపించింది వినోదుడికి.

''యువరాణీ, నువ్వు చెబుతున్న దేవత దర్శనం కోసమే నేను ఇక్కడకు వచ్చాను. అయినా ఆ దేవత ఎక్కడ వున్నదో, అక్కడికి వెళ్ళే మార్గం ఏమిటో నాకు తెలియదు. ఆ మార్గం నాకు తెలియజేశావంటే, నేను ఆ దేవత నుంచి నీకు పాడేవరం సంపాదించి తేగలను," అన్నాడు వినోదుడు ఉత్సాహంగా.

''నేను కూడా నీకొక రహస్యం చెబుతాను. ఈ నీలపర్వతం శిఖరాన ఒక చిత్రమైన మొక్క ఉన్నది. ఆ మొక్క యేడాదికి ఒక్కసారి ఒకే ఒక కాయ కాస్తుంది. ఆ పండును నక్షత్రఫలం అంటారు. ఆ పండును తిన్నవాళ్ళు ఈ భూమినిదాటి దేవత వున్న స్థలం చేరుకో కలుగుతారు,'' అన్నది యువరాణి.

''అలాంటప్పుడు, మీరెందుకు ఆ ఫలాన్ని ఇంతవరకు తినలేదు?'' అని అడిగాడు వినోదుడు.

ఆ ప్రశ్నకు యువరాణి పకపకమంటూ నవ్వి, ''మీ మానవులు తినే విధంగా మేము ఎలాంటి అహారమూ తీసుకోము,'' అన్నది.

''మీకు కావలసినశక్తి ఎలా లభిస్తుంది? మీరెలా ఎదుగుతారు?'' అన్నాడు వినోదుడు ఆశ్చర్యంగా.

''పువ్వులు వికసించేలా మేమూ ఎదుగుతున్నాము. సూర్యుడి వెలుగు నుంచి సహజంగా మాకు కావలసినశక్తి లభిస్తున్నది. మాకు అకలిదప్పులు వుండవు. ఇంతెందుకు, ఇప్పుడు నీకు ఆకలి వేస్తున్నదా?'' అని అడిగింది యువరాణి.

''ఆకలి వేయడం లేదు, నిజమే. కాని కావాలనుకుంటే ఆకలి వేయకున్నా ఆ ఫలాన్ని తినవచ్చుకదా?'' అన్నాడు వినోదుడు.

''సాధ్యపడదు. ఎందుకంటే ఈ భూమిలో, చేయడానికి అవసరం లేని పనులు చేయాలనుకున్నా ఎవరూ చేయజాలరు!'' అని వివరించింది యువరాణి.

ఆ సమయంలో అక్కడికొక జింక పరిగెత్తుకుంటూ వచ్చింది. —(ఇంకావుంది)






# మారణాయుధం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, దేశపాలకుడివైన నువ్వు, ఏ క్షుద్రశక్తులో సంపాదించేందుకు శ్రమపడే కాపాలికుడిలా, అర్ధరాత్రివేళ ఈ శ్మశానంలో సంచరిస్తూండడం, నాకు ఆశ్చర్యంతో పాటు బాధకలిగిస్తున్నది. నువ్వేదో అతి కఠినమైన కార్యం సాధించేందుకు పూనుకున్నావనేది, నిజం. కాని, ఒక కఠిన కార్యాన్ని సాధించడానికి వివేకి అయినవాడు, మరింత కఠినమైన పద్ధతులను అవలంబించడు. ఈతవచ్చును గదా అని, అందుబాటులో వున్న పడవను వదిలి ఏరుదాట ప్రయత్నించడం, అవివేకం గదా! నాగేంద్రవర్మ అనే మహారాజొకడు

## బేతాళ కథలు



మయూరాక్షుడితో మంతనాలు సాగిస్తున్నాడు. ఆ సమయంలో ఒక భటుడు అక్కడికి వచ్చి, ఒక విదేశీవర్తకుడు, రాజు దర్శనం కోసం నిరీక్షిస్తున్నాడని చెప్పాడు. వర్తకుణ్ణి తీసుకురావలసిందిగా రాజు, భటుడికి అనతిచ్చాడు.

విదేశీవర్తకుడు లోపలికివచ్చి, రాజుకు నమస్కరించి, "ప్రభూ, నేను కాంభోజ దేశపు వర్తకుణ్ణి. వర్తకం నిమిత్తం నగరంలో ప్రవేశించి, నాలుగు రోజులైంది. రాజ్యంలో శాంతి భద్రతలను నెలకొల్పేందుకు, తమరు ఎంతగా ప్రయత్నిస్తున్నదీ తెలుసుకున్నాను. తమకు ఉపయోగపడుతుందనుకుంటే— ఈ ఆయుధాన్ని తమకు విక్రయించి పోవాలన్న ఉద్దేశంతో వచ్చాను," అంటూ, పొడవాటి గొట్టంమాదిరిగా వున్న ఒక సాధనాన్ని, రాజుకు యిచ్చాడు.

నాగేంద్రవర్మ దాన్ని పరీక్షగా చూసి, "దీనిలో వున్న ప్రత్యేకత ఏమిటి?" అని వర్తకుణ్ణి ప్రశ్నించాడు.

దానికి వర్తకుడు, "ప్రభూ, ఈ గొట్టానికి అడుగున, ఒక చిన్న మీట అమర్చబడి వున్నది. దాన్ని బొటనవేలితో నొక్కినట్టయితే, సూది లాగా వాడిగా వున్న సన్నని తీగ ఒకటి, శరవేగంతో బయటికి వస్తుంది. అది మనం గురిపెట్టిన లక్ష్యం

యిలాంటి పనే చేశాడు. శ్రమ తెలియకుండా వుండేందుకు అతడి కథ చెబుతాను, విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

మలయదేశాన్ని, నాగేంద్రవర్మ అనే మహారాజు పాలిస్తూండేవాడు. క్రమంగా దేశంలో అరాచకం మితిమీరి, పట్టపగలే దోపిడీలూ, దహనకాండలూ, హత్యలూ ఉధృతం కాసాగాయి. తన రాజ్యంలో ప్రవేశించిన సింధుదేశపు గూఢచారులు, రాజ్యంలోని రాజద్రోహులతో చేతులు కలిపి, యీ ఘోరకృత్యాలు చేయిస్తున్నారని రాజుకు తెలియవచ్చింది.

ఒకనాడు ఆయన, యీ కల్లోలపరిస్థితులను అదుపులో పెట్టేందుకు, మంత్రి

లోకి—మనిషయినా, జంతువయినాసరే, త్రుటికాలంలో దూసుకుపోయి ప్రాణాలు తీస్తుంది,'' అని చెప్పాడు.

రాజు ఆశ్చర్యపోయి, ఏదో అనబోయేంతలో మంత్రి, ''ప్రభూ, ఈ యంత్ర సాధనం శక్తి ఏపాటిదో పరీక్షించాక, తప్పక కొనుగోలు చేద్దాం. ఈ వర్తకుడు ఒకటి, రెండు రోజుల తర్వాత మళ్ళీ వస్తే బావుంటుంది,'' అన్నాడు.

రాజు సరేననగానే, వర్తకుడు యంత్ర సాధనాన్ని అక్కడే వదిలి వెళ్లిపోయాడు.

ఆ రాత్రి నాగేంద్రవర్మ, తన మందిరంలో నిద్రిస్తూండగా, అర్ధరాత్రి వేళ ఏదో చప్పుడై, ఆయనకు మెలుకువ వచ్చింది. ఆయన తల్పం మీది నుంచి లేచి, ''ఎవరది?'' అంటూ గద్దించి అడిగాడు.

ఇద్దరు ముసుగుమనుషులు, విచ్చు కత్తులు చేతబట్టి ఆయన కేసి రాసాగారు. మరుక్షణంలో రాజుకు తన తలగడ కింద వున్న మారణాయుధం గుర్తుకు వచ్చింది. మెరుపు వేగంతో దాన్ని వెలికి తీసి, ఆ ముసుగు వ్యక్తుల కేసి ఒకరి తర్వాత మరొకరికి గురిపెట్టి, మీట నొక్కాడు. వాళ్ళిద్దరూ పెద్దగా ఒక చావుకేక పెట్టి కింద పడిపోయారు.

ఈ కలకలం విన్న భటులూ, పరిచారకులూ అక్కడికి వచ్చారు. చచ్చిన



ముసుగుమనుషులలో, ఒకడు రాజుగారి అంగరక్షకుడని తేలింది. రాజు మారణాయుధానికున్న అద్భుత శక్తిని గురించి ఆలోచిస్తూ నిలబడి పోయాడు.

మర్నాడు విదేశీవర్తకుడు రాగానే, రాజు అతడితో, ''నువ్వు యిచ్చి పోయిన మారణాయుధం శక్తి అపూర్వం. నాకలాంటివి వేలసంఖ్యలో కావాలి,'' అన్నాడు.

వర్తకుడు ఆనందంగా, ''ప్రభూ, నేనడిగిన సామగ్రినీ, మనుషుల్నీ మీరు సమకూర్చినట్లయితే, నేనిలాంటి ఆయుధాల్ని ఎన్నయినా తయారుచేసి యివ్వగలను. తమరు మాత్రం నేనడిగినధర యిప్పించాలి,'' అన్నాడు.



రాజు అందుకు సరేననబోతున్నంతలో, మంత్రి, "ప్రభూ, ముందుగా నన్ను వర్తకుణ్ణి ఒక ప్రశ్న అడగనివ్వండి," అన్నాడు.

రాజు అడగమన్నట్టు తలపంకించాడు. మంత్రి, వర్తకుణ్ణి, "మీ దేశంలో యిలాంటి మారణాయుధాలు తయారు చేసే వాళ్ళెంతమంది వున్నారు?" అని ప్రశ్నించాడు.

"నాతోపాటు మరి కొందరున్నారు. కాని, ఏం ప్రయోజనం! మా మహారాజు వీటి తయారీని నిషేధించారు," అని జవాబిచ్చాడు వర్తకుడు.

"మీ రాజుకు శత్రురాజుల భయం లేదా?" అని అడిగాడు మంత్రి.

"శత్రురాజుల భయం లేకేం!" అన్నాడు వర్తకుడు.

"మీ దేశంలో అరాజకం మాటేమిటి?" అన్నాడు మంత్రి.

"అరాజకం కూడా కొద్దోగొప్పో లేక పోలేదు," అన్నాడు వర్తకుడు.

అప్పుడు మంత్రి, రాజుతో, "ప్రభూ, విన్నారుగదా! కాంభోజ రాజు, యీ మారణాయుధాలను నిషేధించాడు. ఆ దేశపు పౌరుడైన యీ వర్తకుడు, వాటిని మనకోసం తయారు చేసి ధనం అర్జించాలనుకుంటున్నాడు!" అన్నాడు.

మంత్రి మాటలు విన్న రాజు నాగేంద్ర వర్మ, కొద్దిసేపు మౌనంగా ఆలోచిస్తూ వూరుకుని, తర్వాత తన చేతిలో వున్న మారణాయుధాన్ని మధ్యకు విరిచి దూరంగా పారవేసి, మంత్రితో, "ఈ వర్తకుడికి వెయ్యి వరహాలు బహూకరించండి. ఆ తర్వాత మన భటులకు, యీయనను దేశసరిహద్దులు దాటించి రావలసిందిగా ఆదేశించండి." అన్నాడు.

మంత్రి అలాగే చేశాడు. వారం రోజులు గడిచాక రాజు, దేశంలో అరాజకాన్నీ, శత్రుగూఢచారుల ఆగడాలనూ అణిచేందుకు, తానే స్వయంగా పూనుకున్నాడు. ప్రజలకు ఐక్యతా, దేశభక్తీ అవసరాన్ని గురించి ప్రబోధిస్తూ, ఆయన దేశం నలు

మూలలా తిరిగి, చివరకు దేశంలో శాంతి భద్రతలను సుస్థిరం చేయగలిగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, యిక్కడ నాకొక సందేహం కలుగుతున్నది. నాగేంద్రవర్మ విదేశీవర్తకుడి చేత మారణాయుధాలను తయారు చేయించి, శత్రునిర్మూలనకు వాటిని తన సైనికులకు యివ్వవచ్చుగదా? అలాగే, వాటిని ఆత్మరక్షణకోసం ప్రజలకు కూడా అంద చెయ్యవచ్చు. ఇదంతా చాలా తేలికయినపని. అలా చేయక ఎంతో శ్రమతోకూడిన దేశపర్యటనా, ప్రబోధాలకు ఎందుకు పూనుకున్నాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీతలపగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మారణాయుధాల ఉత్పత్తిని తిరస్కరించడంలో, నాగేంద్రవర్మ ఎంతో రాజకీయ చతురతనూ, మానవమనస్తత్వ పరిజ్ఞానాన్నీ ప్రదర్శించాడు. ఇందుకు మంత్రి, విదేశీ వర్తకుణ్ణి అడిగిన ప్రశ్న, దానికి అతడు ఇచ్చిన జవాబూ ఎంతో తోడ్పడింది. ఎక్కడా శత్రుభయం లేని రాజ్యమంటూ వుండదు. అలాగే ప్రజలకు, అంతోయింతో ఆత్మసంరక్షణ చేసుకోవలసిన అవసరం రాని, సమాజం కూడా వుండదు. ఈ రెంటికీ పరిష్కారమార్గం, అందరికీ మారణాయుధాలు పంచడం కానేరదు. విదేశీవర్తకుడు చెప్పిన కాంభోజరాజు అనుభవం, యిందుకు ప్రత్యక్ష నిదర్శనం. అందరికీ మారణాయుధాలు అందుబాటులో వుంటే—అర్థం లేని ఆవేశకావేషాలూ, చిన్న చిన్న చిలిపి తగవుల్ని కూడా మనుషులు అలాంటి సాధనాలు ఉపయోగించి పరిష్కరించుకోవాలని చూస్తారు. ఇది గ్రహించడంవల్లనే నాగేంద్రవర్మ, ఎంతో శ్రమతో కూడినదైనా ప్రజలకు దేశభక్తి, ఐక్యతా ప్రబోధించి సఫలుడయ్యాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# తీరనికోరిక

ధర్మపురి అనే గ్రామంలో, సోమసుందరం అనే గృహస్థు వుండేవాడు. అతడికి గ్రామంలో, ఒక కిరాణాకొట్టు వున్నది. దైవభక్తి, పేదసాదలపట్ల ఆదరణాకల వాడు. అతడి భార్య కామేశ్వరి, భర్తకు తగిన ఇల్లాలు.

ఒకనాటి మిట్టమధ్యాహ్నంవేళ, సోమ సుందరం ఇంటిముందు, కృపానందు డనే సన్యాసి నిలబడి, "నాయనా, ఈ పూటకు మీ ఆతిథ్యం యివ్వగలరా ?" అని అడిగాడు.

సన్యాసి కేసి తేరిపారచూసిన సోమ సుందరానికి, ఆయన ముఖంలో గొప్ప తేజస్సు కనబడింది. వెంటనే అతడు, సన్యాసిని ఇంట్లోకి తీసుకుపోయి మంచి భోజనం పెట్టాడు.

భోజనం అయాక సన్యాసి, సోమ సుందరంతో, "నాయనా, నీ ఆతిథ్యం నాకెంతో సంతోషం కలిగించింది. నీకు తీరని కోరిక ఏదైనా వుంటే చెప్పు. ఆ కోర్కె తీర్చడానికి ప్రయత్నిస్తాను," అన్నాడు.

సోమసుందరం వెంటనే ఏదో చెప్ప బోయేసరికి, సన్యాసి అతణ్ణి వారించి, "ఆ కోరిక ఏదో నిదానంగా ఆలోచించి చెప్పు. తీరని కోరిక అంటే—అది నీ ప్రయత్నంవల్ల సాధ్యపడనిదై వుండాలి," అన్నాడు.

సోమసుందరం కొంచెంసేపు బాగా ఆలోచించి, "స్వామీ, ఎంతోకాలంగా కష్టపడి చేస్తున్నా, వ్యాపారంలో నాకు ఎదుగుబొదుగులు లేవు. ఒకరకమైన దారిద్ర్యబాధ నన్ను వదలడం లేదు. నన్ను దారిద్ర్యబాధ నుంచి విముక్తుణ్ణి చేయండి. అదే నా తీరనికోరిక!" అన్నాడు వినయంగా.

పెంటకోట సోమినాయుడు

"సరే, నీ దారిద్ర్యబాధ నేటితో తీరిపోతుంది. అదే నీ తీరనికోరికగా భావించి, నేను వెళుతున్నాను. మళ్ళీ పది సంవత్సరాల తర్వాత యిటుగా వస్తాను." అని సన్యాసి వెళ్ళిపోయాడు.

ఆ రోజు నుంచి, సోమసుందరం వ్యాపారం బాగా అభివృద్ధి చెందింది. అతడు పట్టిందల్లా బంగారం కాసాగింది.

పది సంవత్సరాలు గడిచాయి. సన్యాసి, సోమసుందరాన్ని చూడవచ్చాడు. సోమసుందరం, ఆయనకు ఘనంగా స్వాగత సత్కారాలు చేసి, షడ్రసోపేతమైన భోజనం పెట్టాడు.

తర్వాత సన్యాసి, సోమసుందరంతో, "నాయనా, నేను నీ ఇంటికి వచ్చి పది సంవత్సరాలైంది. ఇప్పటికీ నీకు తీరని కోరిక ఏదైనా వుంటే చెప్పు, తీరుస్తాను. కాని, ఇక్కడ ఒక ముఖ్య విషయం మరిచిపోవద్దు. ఒక మనిషికి కేవలం ఒక్కసారి మాత్రమే కోరిక తీర్చగలశక్తి నాకున్నది. అందువల్ల, నీవిప్పుడు కోరే కోర్కెను తీర్చానంటే, గతంలో నే తీర్చిన కోర్కె ఫలితం కొరగానిదవుతుంది. బాగా ఆలోచించుకో," అన్నాడు.

"స్వామీ, ఎంత ధనం వుండీ ఏం ప్రయోజనం, సంతానం అనేది లేకపోయాక! అందువల్ల, నేను ధనాన్ని వదులుకోవడానికి సిద్ధంగా వున్నాను. నాకు సంతానప్రాప్తి కలిగించండి," అన్నాడు సోమసుందరం.



ఆ మాటలకు సన్యాసి చిన్నగా నవ్వి, "చూడు, నాయనా! నువ్వు ఎంతో కాలంగా వ్యాపారం చేస్తున్న అనుభవశాలివి కనుక, దానిలోని మెలుకువలు బాగా తెలిసినవాడివై వుండాలి. ఆ కారణంగా, ధనసంపాదనకు మరెవరి సాయం నీకవసరం లేదు! ఎవడైనా అనాథబాలుణ్ణి తెచ్చి పెంచుకుంటే, నీకు సంతానం లేదన్నబాధ తప్పుతుంది. కాబట్టి, ఆ రెండు కోరికలనూ నువ్వే సాధించుకోగలవు. ఆ సంగతి గుర్తుంచుకో!" అన్నాడు.

సోమసుందరం కొద్దిసేపు మౌనంగా వుండిపోయి, తరవాత, "స్వామీ, నా మీద దయతలిచి మీరే సెలవివ్వండి, నేనెలాంటి కోరిక కోరాలో!" అన్నాడు నెమ్మదిగా.

"ఎలాంటి కోరికవల్ల, నీకు జీవితం సంతృప్తికరంగా సాగిపోతుందో, అలాంటి కోరికకోరు," అని సలహా యిచ్చాడు సన్యాసి.

ఈ సలహా వింటూనే సోమసుందరానికి, తన అసంతృప్తికి కారణం అర్థమైంది. తన కోరిక ఒకటి నెరవేరగానే, మనసులో మరొక కోరిక చోటుచేసుకుంటున్నది. దానితోపాటు జీవితంపట్ల అసంతృప్తి ఏర్పడుతున్నది.

సోమసుందరం ఎంతో వినయంగా, "స్వామీ, యిప్పటికి నా కళ్ళు తెరుచుకున్నవి. నాకు జీవితంలో తృప్తిని ప్రసాదించండి అదిచాలు. అప్పుడు, నాకు యింకా ఏదో కావాలనే కోరిక వుండదు." అన్నాడు.

ఆ మాటలకు సన్యాసి తృప్తిగా తలాడించి, "ఈ క్షణం నుంచీ జీవితంలో, నీకు అసంతృప్తి అనేది వుండదు. ఉన్నదానితో తృప్తి చెందుతావు." అని చెప్పి, అక్కడి నుంచి బయలుదేరాడు.

సోమసుందరం, పరమానందంతో, ఆయన కనుమరుగయేవరకూ తృప్తి నిండిన కళ్ళతో అలాగే చూస్తూ నిలబడిపోయాడు.





కావ్యకథలు:

# రాక్షసముద్రిక-4

చాణక్యుడి సహాయంతో, చంద్రగుప్తుడు, నందులను ఓడించాడు. నందుల మంత్రి రాక్షసుణ్ణి చంద్రగుప్తుడి వైపు తీసుకురావడానికి చాణక్యుడు పథకం వేశాడు. చంద్రగుప్తుడితో ఘర్షణపడు తున్నట్టు నటించి, చాణక్యుడు చంద్ర గుప్తుడి ఆస్థానాన్ని వదలి వెళ్లిపోయాడు.

చాణక్యచంద్రగుప్తులు బహిరంగంగా ఘర్షణపడినవార్త, మలయకేతుడికి తెలిసింది. పాటలీపుత్రం మీద దండెత్తడానికి ఇదే సరైన సమయం, ఇటువంటి అవకాశం మళ్ళీ రాదు— అనుకుని మలయకేతుడూ, రాక్షసుడూ యుద్ధసన్నాహాలు గావించసాగారు.







ఆ సమయంలోనే చాణక్యుడు— మలయకేతుడిని పరిమార్చడానికి సమయం ఆసన్నమయిందన్న విధంగా అర్థం వచ్చేట్టు, రాక్షసుడు చంద్రగుప్తుడికి రాసినట్టు—ఒక దొంగ ఉత్తరం రాయించాడు.



రాక్షసుడు ఉపయోగించిన నందుల రాజముద్రికను చాణక్యుడు ఎలాగో సంపాయించి, ఆ రాక్షసముద్రికను, తాను రాయించిన లేఖ మీద ముద్రించి దానిని తన చారుడి ద్వారా మలయకేతుడి రాజ్యానికి పంపాడు.

ఆ చారుడు, పాటలిపుత్ర సమీపంలో బసచేసి ఉన్న మలయకేతుడి సైనికులకు పట్టుబడకుండా తప్పించుకు పోవాలని ప్రయత్నించేవాడిలా నటిస్తూ, కావాలనే వాళ్ళకు పట్టుబడిపోయాడు.





ఈ విషయం మలయకేతుడికి తెలిసింది. చారుడి వద్ద వున్న ఉత్తరం చూసి అతడు దిగ్భ్రాంతి చెందాడు. ఆ ఉత్తరం అతణ్ణి—రాక్షసుడు ద్రోహీ, మోసగాడూ అని నమ్మేలా చేసింది. పైగా, ఆ చారుడు మలయకేతుడి ఆప్తులుగా ఉన్న రాజులు కొందరిని రాక్షసుడి కుట్రలో భాగస్వాములని చెప్పాడు!

మలయకేతుడు మొదట రాక్షసుణ్ణి నిలదీశాడు. ఆ ఉత్తరం సంగతి తనకేమీ తెలియదన్నాడు రాక్షసుడు. అయినా, రాక్షసముద్రిక వేయబడి ఉండడం వల్ల మలయకేతుడు అతణ్ణి నమ్మలేదు. విరక్తి చెందిన రాక్షసుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు!





వెంటనే మలయకేతుడు—తనకు వ్యతిరేకంగా కుట్రపన్నుతున్నట్టు అనుమానించిన తన ఆప్తులందరినీ అమితావేశంతో హతమార్చాడు. దీనిని చూసి హడలిపోయిన మిగిలినవాళ్ళు, మలయకేతుడిపైబడి అతన్ని బంధించారు.

విరక్తి చెందిన రాక్షసుడు పాటలీపుత్రం కేసి నడవసాగాడు. అతడు పాటలీపుత్రం ప్రవేశించగానే, తన కుటుంబానికి ఆశ్రయమిచ్చిన, చందనదాసును రాజభటులు బంధించి ఊరికి దూరంగా తీసుకుపోవడం చూశాడు.





రాక్షసుడు అక్కడికి పరిగెత్తిపోయి, చందనదాసును ఎందుకు బంధించి తీసుకుపోతున్నారని భటులను ప్రశ్నించాడు. "మా రాజుకు శత్రువయిన రాక్షసమంత్రి కుటుంబానికి ఇతడు ఆశ్రయం ఇచ్చాడు. ఆ రాజద్రోహ నేరానికి ఇతనికి మరణశిక్ష విధించారు. దానిని నెరవేర్చడానికి వధ్యభూమికి తీసుకు వెళుతున్నాము," అని చెప్పారు భటులు.

"నేనే రాక్షసుణ్ణి! నా కుటుంబానికి ఆశ్రయం ఇచ్చిన ఆ దయామూర్తిని వదిలిపెట్టి నన్ను చంపండి," అన్నాడు రాక్షసుడు. అప్పుడే తన పరివారంతో అక్కడికి వచ్చిన చాణక్యుడు, "రాక్షసా! చంద్రగుప్తుడికి నువ్వు మంత్రి నవుతానని మాట ఇచ్చావంటే, నీ మిత్రుణ్ణి ప్రాణాలతో వదలగలం!" అన్నాడు.





రాక్షసుణ్ణి చంద్రగుప్తుడి పక్షం చేసుకోవాలన్న ఉద్దేశంతోనే—తాను రాక్షసుడు రాసినట్టు దొంగతనంగా ఉత్తరం రాసి పంపాననీ, చందనదాసుకు మరణశిక్ష విధించినట్టు నాటకమాడాననీ—చాణక్యుడు రాక్షసుడికి జెప్పాడు. చంద్రగుప్తుడికి మంత్రిగా ఉండడానికి రాక్షసుడు అంగీకరించాడు. చాణక్యుడి సహాయంతో, చంద్రగుప్తుడు మగధ సింహాసనంతోపాటు రాక్షసమంత్రిని కూడా వశపరచుకున్నాడు! —(అయిపోయింది)




# విద్యామహిమ

దేవగిరి అనే ఊళ్లో సోమదేవు డనే వాడికి ఇద్దరు కొడుకు లుండేవారు. పెద్ద వాడు పొలమూ పుట్రా చూసుకుంటూ ఇంటి దగ్గిరే ఉండి పోయాడు. రెండో వాడు జయదేవుడు విద్యాభిలాషతో ఇల్లు విడిచి తగిన గురువును వెతుక్కుంటూ దేశ సంచారం బయలుదేరాడు.

జయదేవుడు తిండి లేకుండానూ, సరి అయిన నిద్ర లేకుండానూ చాలాకాలం ప్రయాణం చేసి చివరకు ఒక గ్రామంలో హరిశర్మ అనే ఆయన ఇంటి ముందు శోష వచ్చి పడిపోయాడు.

హరిశర్మ జయదేవుణ్ణి తన ఇంటి లోపలికి తీసుకుపోయి, తాగటానికి నీరిచ్చి, స్నానం చేయించి భోజనం పెట్టి అతడి సమాచారమంతా తెలుసుకున్నాడు. జయదేవుడు విద్యాభిలాషతో ఇల్లు వదిలి పెట్టి మంచి గురువు కోసం తిరుగుతున్నాడని విని హరిశర్మకు చాలా సంతోష మయింది. ఆయన గొప్ప పండితుడు. అందుచేత జయదేవుణ్ణి మూడేళ్ళపాటు తన ఇంటనే ఉంచుకుని, భోజనం పెట్టి చదువు చెప్పాడు. జయదేవుడు సూక్ష్మ బుద్ధి కావటంచేత ఆ మూడేళ్ళ కాలం లోనే గురువుగారికి తెలిసిన విద్యలన్నీ నేర్చేసుకున్నాడు.

తరవాత హరిశర్మ జయదేవుడితో, ''నాయనా, ఇంకొక గురువు ధగ్గిర కొన్ని విద్యలు నేర్చితే గాని నీ చదువు పూర్తి కాదు. ఆ గురువు ఒక కోయరాజు. అతను నీకు చోరవిద్యా, వేటా మొదలైనవన్నీ నేర్పుతాడు. అతడి దగ్గిరికి ఎలా వెళ్ళాలో నేను చెబుతాను,'' అన్నాడు.

హరిశర్మ చెప్పిన మార్గాన బయలుదేరి జయదేవుడు కోయరాజు వద్దకు వెళ్ళాడు. హరిశర్మ పంపిన శిష్యుడని తెలుసుకుని



కోయరాజు జయదేవుణ్ణి తన వద్ద ఒక సంవత్సరంపాటు ఉంచుకుని దొంగతనాలు చెయ్యటమూ, దొంగలను పట్టటమూ, మృగాల జాడలు తెలుసుకోవటమూ, వేటాడటమూ మొదలైన విద్యలన్నీ నేర్పాడు.

ఈ విధంగా సకల విద్యలూ నేర్చి జయదేవుడు ఇంటి మార్గంపట్టి వస్తూ, ఒక రోజు ఒక గ్రామం చేరి ఒక బ్రాహ్మణ గృహంలో మంచి నీరిమ్మని అడిగాడు. ఆ ఇంటి యజమాని జయదేవుణ్ణి లోపలికి ఆహ్వానించి, అతిథి సత్కారమంతా చేసి అతని సంగతి అంతా తెలుసుకుని, "అబ్బాయీ, నీ విద్యాకౌశలం పరీక్షించటానికి ఒక్క ప్రశ్న అడగనా?" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"అడగండి," అన్నాడు జయదేవుడు ఉత్సాహంగా.

"నీవు రాకమునుపు ఈ ఇంటి కెవరు వచ్చారు? ఈ ఇంటి ముందుగా ఎవరెవరు వెళ్ళారు? చెప్పు చూస్తాం!" అన్నాడు ఇంటి యజమాని.

జయదేవుడు లేచి బయటికి వెళ్ళి, కొంత సేపయాక తిరిగి వచ్చి, "నేను రాకపూర్వం మీ ఇంటికి నలుగురు వ్యక్తులు వచ్చారు. వారు రాజభటులో, సైనికులో అయి ఉంటారు. వారు మీ ఇంటి నుంచి బయలుదేరి ముందుకు సాగిపోయారు. వారికన్న ముందుగా ఒక మనిషి మీ ఇంటి ముందుగా వెళ్ళాడు. వాడి నెత్తి మీద ఒక బొగ్గుల మూట ఉన్నది. వాడేదో దొంగతనం చేసి ఉంటాడు," అని ఇల్లు గల బ్రాహ్మణుడితో అన్నాడు.

ఈ మాటలు విని బ్రాహ్మణుడు నిర్ఘాంతపోయి, "మా ఇంటికి నలుగురు రాజభటులు వచ్చినమాట వాస్తవం. జరిగినదేమంటే, రాణిగారి రత్నం ఒకటి దేవాలయం ప్రాంతాల పడిపోయింది. అది పోయిందని తెలిసి వెతికే లోపుగా దాన్ని ఎవరో కాజేశారు. అందుచేత రాజభటులు అందరి ఇళ్ళకూ వచ్చి సోదా



చేశారు. అలాగే మా ఇల్లు కూడా సోదా చేశారు. కాని పోయిన నగ దొరకలేదు. దొంగ ఒకడు మా ఇంటి ముందుగానే వెళ్ళాడని నీవు చెబుతున్నావు గనక, పోయిన నగ తిరిగి సంపాదించి దొంగను రాజుగారికి పట్టి యిస్తివా, నీకు గొప్ప బహుమానం దొరుకుతుంది.'' అని జయదేవుడితో అన్నాడు.

జయదేవుడు బ్రాహ్మణుడితో మళ్ళీ వస్తానని చెప్పి, బయలుదేరి దారి మీదనే దృష్టి ఉంచి నడుస్తూ ఒక ఇంటిదాకా వెళ్ళాడు. అది ఒక స్వర్ణకారుడి ఇల్లు. జయదేవుడు లోపలికి వెళ్ళి, స్వర్ణకారుడితో బంగారం ధర గురించీ, అతను చేసే కొత్త రకాల నగలను గురించీ కాస్సేపు మాట్లాడి శలవు తీసుకున్నాడు. తరవాత అతడు బ్రాహ్మడి వద్దకు తిరిగి వచ్చి, ''దొంగను పట్టి ఇవ్వగలను రాజభటులను పిలిపించండి,'' అన్నాడు. బ్రాహ్మణుడు రాజభటులకు కబురు పంపి, జయదేవుడితో, ''అయితే నాయనా, ఇదంతా నీవు ఎలా కనుక్కోగలిగావు ?'' అని అడిగాడు.

''సైనికులూ, యుద్ధ విద్య నేర్చిన భటులూ నడిచేటప్పుడు వారి అంగలు ఒకే ప్రమాణంలో ఉంటాయి. వారు బారుతీరి నడుస్తారు. పాదాలు రెండూ ఒకే ఊతంతో వేస్తారు. అందుచేత అడుగు జాడలను బట్టి నలుగురు మనుష్యులు మీ ఇంటికి వచ్చారనీ, వారు సైనికులు గాని, భటులుగాని అయి ఉంటారనీ తేలికగా ఊహించాను. వారు మీ ఇల్లు దాటి ముందుకుపోవటం కూడా నాకు స్పష్టంగా కనిపించింది,'' అన్నాడు జయదేవుడు.

''మరి, దొంగజాడ ఎలా తెలిసింది ?'' అని బ్రాహ్మణుడు అడిగాడు.

''దొంగ నడివీధిన నడవడు. ఒక పక్కగా నడుస్తాడు. ఈ దొంగ నెత్తిన బొగ్గులమూట ఉన్నది. వాడు అడుగు వేసినప్పుడల్లా కొంచెంగా బొగ్గునుసి

రాలింది. వాడు బొగ్గులు తీసుకుని తిన్నగా నడిచిపోక మధ్యమధ్య వెనక్కు తిరిగి చూసినట్టుగా అడుగుల గుర్తులనుబట్టి తెలుస్తున్నది. తనను ఎవరన్నా వెంబడిస్తున్నారేమోనని వాడు అలా చూసి ఉంటాడు. అందుచేత వాడేదో దొంగతనం చేసి ఉంటాడని ఊహించాను. అదీగాక రాజభటుల అడుగుల జాడలకన్న ఈ దొంగవి కొద్దిగా చెరిగి ఉన్నాయి. అందు చేత వాడు ఇటుగా వెళ్ళి ఒకటి రెండు ఘడియలు ఎక్కువ కాలమయింది. ఈ మధ్యలో ఇంకొక దొంగతన మేదీ జరగ లేదు గనక రాజభటులు వెతుకుతున్నది, ఈ దొంగ కోసమే అయి ఉండవచ్చు,'' అన్నాడు జయదేవుడు.

వీళ్ళు ఇలా మాట్లాడుతూండగానే రాజభటులు వచ్చారు. జయదేవుడు వారిని స్వర్ణకారుడి ఇంటికి తీసుకుపోయాడు. ఆ ఇల్లు రాజభటులు అంతకుముందు సోదా చేసినదే. అయితే వారు పెట్టెలూ బేడలూ మాత్రమే వెతికారు. కాని దొంగలు ఏదన్నా దాచిపెట్టటానికి ఏదో ఒక కంతలో దూర్చిపెడతారు. ఈ సంగతి జయదేవుడికి తెలుసు. అందుచేత అతను రాణిగారు పోగొట్టుకున్న రత్నాన్ని స్వర్ణకారుడు ఇంటి లోని ఒక కంతలో నుంచి బయటికి తీశాడు.

స్వర్ణకారుడు నేరం ఒప్పుకున్నాడు. రాణిగారి రత్నం కింద పడటం తాను చూసి, దాన్ని తీసుకున్నాననీ, ఎవరికీ సందేహం కలగకుండా ఉండగలందులకు ఒక బొగ్గుల మూట కొనుక్కుని, అందుకే గ్రామంలోకి వెళ్ళిన వాడి లాగా ఇంటికి వచ్చేశాననీ అతను చెప్పాడు.

రాజుగారు నగ దొరికినందుకు చాలా సంతోషించి, జయదేవుడికి మంచి బహుమానం ఇచ్చాడు. అతను దొంగను పట్టుకున్న విధమంతా బ్రాహ్మడు చెప్పినాక రాజు మరింత సంతోషించి, అన్ని విద్యల లోనూ ఆరితేరిన జయదేవుడికి మరిన్ని కానుకలు ఇచ్చి, తన కొలువులో ఉంచుకున్నాడు.





# కృష్ణావతారం

కంసుడు మరణించిన వార్త తెలియగానే అతని భార్య లందరూ మూర్తీభవించిన శోకదేవతలలాగా వచ్చి, తమ భర్త కళేబరం మీద పడి వైనవైనాలుగా ఏడ్చారు. మూడు లోకాలలోనూ కంసుణ్ణి జయించగలవాడు లేడని వాళ్ళ నమ్మకం. అలాటివాడు ఒక కుర్రవాడి చేతిలో ఇంత దారుణంగా మరణిస్తాడనీ, ఇంతలోనే తమకు వైధవ్యం సంప్రాప్త మవుతుందనీ వారు అనుకోలేదు.

కంసుడి తల్లి కూడా తన కోడళ్ళతోబాటు కొడుకు కోసం దుఃఖించింది. ఆమె తన భర్త అయిన ఉగ్రసేనుడి వద్దకు వెళ్ళి, ''పిడుగు పడి కూలిపోయిన కొండలాగా పడి ఉన్న నీ కొడుకును చూసుకున్నావా? వాడికి దహనసంస్కారాలు జరపాలిగదా? తన బాహుబలంతో కృష్ణుడు రాజ్యాన్ని గెల్చుకున్నాడు. కృష్ణుణ్ణి ఉత్తరక్రియలకు అనుమతించమని అడుగు,'' అన్నది.

కంసుడి చావు చూసి మరీ వెళ్ళిపోదామన్నట్టుగా సూర్యుడు అస్తమించాడు. ఆ సంధ్యవేళ యాదవుల మధ్య ఉన్న కృష్ణుడికి కంసుడి భార్యల రోదనలు వినవచ్చాయి. అతని కళ్ళ నీళ్ళు తిరిగాయి. అతను తన చుట్టూ ఉన్న బంధుజనంతో, ''నేను అతి బాల్యం మూలాన ఉద్రేకంతో ఎంతమంది స్త్రీలకు వైధవ్యదుఃఖం కలిగించాను! కాని, నిజం ఆలోచిస్తే, కంసుడి దుర్మార్గానికి మరొక

12. బలరామకృష్ణుల విద్యాభ్యాసం



విరుగుడు లేదు. ఈ దుర్మార్గుడిలాగా తన తండ్రిని నిర్బంధంలో ఉంచి తానే రాజ్యం ఏలినవాడెక్కడైనా ఉన్నాడా? పాపిని చూసి జాలిపడటం కూడా పాపమే నని చెబుతారు. లోకక్షేమం కోరి నేనీ దుర్మార్గుణ్ణి చంపాను. ముందు ఏం చెయ్యాలో కూడా నేను ఆలోచించే పెట్టాను," అన్నాడు.

అతనిలా అంటూండగానే ఉగ్రసేనుడు, శిని మొదలైన యాదవవృద్ధులను వెంటబెట్టుకుని వచ్చి, కృష్ణుడి ముందు కొద్దిసేపు తల వంచుకుని నిలబడి, కన్నీరు కార్చి, తల ఎత్తి, గద్గద కంఠంతో, "నాయనా, అతి భయంకరుడైన శత్రువును హతమార్చి గొప్పఖ్యాతి సంపాదించుకున్నావు; యాదవ వంశానికి మహదానందం చేకూర్చావు. ఇక రాజ్యం నీదే. నువే రాజువు. ఏ లోటూ లేకుండా మహావైభవంగా రాజరికం అనుభవించు. నీ శత్రువు పోయాడు గనక, నీ మనసులో పగ పెట్టుకోక, నాబోటివారిపట్ల ఆదరంతో ప్రవర్తించు. ప్రస్తుతం కంసుడి ప్రేతవిధి జరగవలసి ఉన్నది. ఇందుకు నువు అనుమతించే పక్షంలో నేనూ, నా భార్యా, నా కోడళ్ళూ ఇన్నినీళ్ళు వదులుతాము. ఆ తరవాత నేను జటావల్కలాలు ధరించి అరణ్యవాసం చేసుకుంటాను," అన్నాడు.

ఆ మాటకు కృష్ణుడు, "దీనికి నా అనుమతి కావాలా? కంసుడి ఉత్తరక్రియలకు నేను అభ్యంతరం చెబుతానా? ఒక్క మాట చెప్పవలసి ఉన్నది. నాకు రాజ్యంతో పని లేదు. నేను రాజధనం మీది ఆశ కొద్దీ కంసుణ్ణి చంపలేదు. వంశద్రోహీ, లోక కంటకుడూ కనక, లోకహితం కోరి అతన్ని చంపాను. అందువల్ల నాకు వచ్చే కీర్తి చాలు. ఇక నేను నా మానాన ఆవుల మందల మధ్యకు వెళ్ళి, అడవిజంతువులాగా గోపాలకులతో కలిసి ఆటలూ, పాటలూ సాగిస్తాను. నా మనవి ఒకటి ఉన్నది. నే నీ మాటలు కపటంగా



అంటున్నవి కావు. న్యాయంగా నీదైన రాజ్యాన్ని నీచుడై నీ కొడుకు హరించాడు. అది చివరకు నీదే అయింది. హాయిగా రాజ్యాభిషేకం చేసుకో. ఈ రాజ్యం నేను గెలిచి నీ కిస్తున్నాను. నా మీద వాత్సల్య ప్రేమలున్నపక్షంలో నా కోరిక నిరాకరించ వద్దు," అన్నాడు.

అనటంతో పోనివ్వక కృష్ణుడు ఉగ్రసేనుడికి అప్పటికప్పుడే అందరి మధ్యా రాజ్యాభిషేకం జరిపించేశాడు. ఉగ్రసేనుడు బలరామకృష్ణులకు చేయించవలసిన సంస్కరణలన్నీ చేయించాడు. కృష్ణుడు పూనుకుని మధురానగరాన్ని పూర్వంకన్న చాలా వైభవంగా తయారు చేశాడు.

ఒకనాడు అతను బలరాముడితో, "మనం పుట్టిన నాటినుంచీ చదువూ, సంస్కారమూ, ఆచారమూ లేకుండా అడవుల వెంబడి తిరిగాం. ఇప్పటికైనా ఒక గురువు దగ్గిర చేరి చదువుకోవటం మంచిదిగదా!" అన్నాడు.

ఈ ఆలోచన రాగానే బలరామకృష్ణులు తమ అభిప్రాయాన్ని అయినవాళ్ళకు చెప్పి, వారి అనుమతితో అవంతిపురంలో ఉండే సాందీపనుడనే బ్రాహ్మణుడి వద్దకు వెళ్ళి, తమ గోత్రనామాలు తెలుపుకుని, చదువు చెప్పమని ప్రార్థించారు. ఆయన వాళ్ళను తన శిష్యులుగా పరిగ్రహించి, అరవైనాలుగు రోజులలో నాలుగు వేదాలూ, షడంగాలూ చెప్పాడు. వాళ్ళు పన్నెండు రోజులలో ధర్మశాస్త్రమూ, తర్కమూ, న్యాయశాస్త్రమూ, గణితమూ, సంగీతమూ, సైనిక విద్యలూ నేర్చుకున్నారు. యాభై రోజులలో అస్త్రశాస్త్రం పూర్తిగా అభ్యసించారు. సాందీపనుడు వారి అధ్యయన శక్తి చూసి, "వీళ్ళు మానవ రూపంలో వచ్చిన సూర్య చంద్రులా ఏమిటి?" అనుకుని ఆశ్చర్యం పొందాడు.

బలరామకృష్ణులు గురువు వద్ద విద్యాభ్యాసం పూర్తిచేసి, ఆయనకు భక్తితో నమస్కరించి. "మీ దయవల్ల మేము



విద్యావంతులమయాం. మావల్ల మీకు ఏం కావాలో కోరండి. ఎంత దుర్ఘటమైనా సరే, మీ కోరిక తప్పకుండా నెరవేరుస్తాం,'' అన్నారు.

ఆ మాట విని సాందీపనుడు, చాలా సంతోషించి, ''నా కొక కొడుకుండేవాడు. వాడు తీర్థయాత్రలు చేస్తూ సముద్రస్నానం చేస్తూండగా ఒక తిమివాణ్ణి మింగింది. ఆ పుత్రశోకం నన్నిప్పటికీ దహించుతూనే ఉన్నది. నా కొడుకును ఎలాగైనా నాకు తిరిగి ఇప్పించండి, అంతే చాలు,'' అన్నాడు.

ఆయన కోరిన గురుదక్షిణ చెల్లించటానికి నిశ్చయించి కృష్ణుడు, అన్న అనుమతి పొంది, ధనుర్బాణాలు తీసుకుని సముద్రతీరానికి వెళ్ళి, సముద్రుడితో, ''మా గురువుగారు సాందీపనుడు తన కొడుకును నీలో పోగొట్టుకున్నాడట. అతన్ని మింగిన దుష్టుణ్ణి తక్షణం చూపించు,'' అన్నాడు.

వెంటనే సముద్రుడు ప్రత్యక్షమై భయంతో చేతులు జోడించి, ''పంచజనుడనే రాక్షసుడు తిమి రూపంలో వచ్చి మీ గురువుగారి కొడుకును మింగేశాడు. ఆ రాక్షసుణ్ణి ఇప్పుడే నీ ముందుంచుతాను,'' అన్నాడు.

మరుక్షణమే సముద్రపు కెరటాలు తిమి రూపంలో ఉన్న పంచజనుణ్ణి తెచ్చి ఒడ్డున పారేశాయి. కృష్ణుడు కత్తితో దాని పొట్ట చీల్చి చూస్తే దానిలో గురుపుత్రుడు లేడు, కాని ఒక గొప్ప శంఖం ఉన్నది. దాన్ని చూడగానే కృష్ణుడికి ముచ్చటవేసి, తన ఉపయోగంకోసం ఉంచుకున్నాడు. పంచజనుడి కడుపులో దొరికింది గనక ఆ శంఖానికి పాంచజన్య మనే పేరు వచ్చింది.

అయితే గురుపుత్రుడి సమస్య తీరలేదు. ఆ కుర్రవాడు ఏమై ఉంటాడు? చచ్చిపోయి యమలోకానికే పోయి ఉండాలి. ఇలా అనుకుని కృష్ణుడు తిన్నగా దక్షిణ దిక్కుగా బయలుదేరి యమ



లోకానికి వెళ్ళి, సింహాసనంమీద కూర్చుని ఉన్న యమధర్మరాజును చూసి, కోపంగా, "మా గురువుగారైన సాందీపనుడి కొడుకును నువు తీసుకొచ్చావు. అతన్ని నాకు తిరిగి ఇచ్చెయ్యి. ఇవ్వకుండా దౌర్జన్యానికి దిగావో, నీప్రాణాలు తీస్తాను," అన్నాడు.

యముడు వణికిపోతూ లేచి నిలబడి, చేతులు జోడించి, "నేను ప్రాణుల పుణ్య పాపాలు నిర్ణయించే వాణ్ణేగాని, ప్రాణాలు తెచ్చేవాణ్ణి కాను, అది మృత్యువు పని," అని చెప్పాడు.

"మృత్యువు కింత పొగరా? అన్యాయంగా మా గురుపుత్రుణ్ణి తీసుకుపోవటమే గాక, మమ్మల్ని ఇంత దూరం తిప్పిస్తాడా? ఈ క్షణంతో వాడి ఆయువు మూడింది!" అంటూ కృష్ణుడు వింటికి ఒక దివ్యబాణం ఎక్కుపెట్టాడు. అది చూసి భయపడి మృత్యువు గురుపుత్రుడి ప్రాణాలను తిరిగి శరీరంలో ఉంచి తెచ్చి, కృష్ణుడి ముందుంచాడు.

ఈ విధంగా కృష్ణుడు సముద్రుణ్ణీ, యముణ్ణీ, మృత్యువునూ గడగడలాడించి పాంచజన్యాన్నీ, ప్రాణాలతో గురుపుత్రుణ్ణి సాధించి, తన గురువు దగ్గిరికి తిరిగి వచ్చాడు. గురువుగారు ఆశ్చర్యంతోనూ ఆనందంతోనూ వివశుడై, తన కొడుకుని కౌగలించుకుని, అపూర్వమైన గురుదక్షిణ ఇచ్చినందుకు కృష్ణుణ్ణి వెయ్యివిధాల ఆశీర్వదించాడు.

బలరామకృష్ణులు మరికొన్ని రోజులు గురువుగారింట ఉండి, ఆయనవద్ద సెలవు పుచ్చుకుని, మధురా నగరానికి తిరిగి వచ్చారు.

వాళ్ళకు ఉగ్రసేనుడు బ్రహ్మాండమైన స్వాగతమూ, ఊరేగింపూ ఏర్పాటుచేసి, బంధువులనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని వాళ్ళకు ఎదురువెళ్ళి, మేళతాళాలతో తీసుకొచ్చాడు. బలరామకృష్ణులు వసుదేవుడి ఇంటికి చేరుకుని, తమ విద్యాభ్యాసం అనుభవాలు అందరికీ వివరంగా

చెప్పి, అక్కడే సుఖంగా కాలం గడప సాగారు.

జరాసంధుడు మగధదేశానికి రాజు. ఇతని కుమార్తెలు అస్తి, ప్రాస్తి అనే వాళ్ళు కంసుడి భార్యలు. తన అల్లుణ్ణి కృష్ణుడు చంపి, తన కుమార్తెలకు వైధవ్యం కలిగించాడన్న వార్త విని ఆ కోపంతో, జరాసంధుడు, అనేకమంది రాజులను కూడగట్టుకుని, ఇరవైఒక్క అక్షౌహిణీల సేనను వెంటబెట్టుకుని మధుర మీదికి యుద్ధానికి బయలుదేరి వచ్చి, యమునాతీరాన విడిసి, విందుడూ, అనువిందుడూ అనే రాజకుమారులను కృష్ణుడివద్దకు తన దూతలుగా పంపాడు.



వారు ఉగ్రసేనుడి సభకు వచ్చి, ఆ సభలోనే బలరాముడితో సహా కూర్చుని ఉన్న కృష్ణుడితో, జరాసంధుడి మాటలుగా ఇలా చెప్పారు :

"నువ్వూ, నీ అన్నా పెద్ద మొనగాళ్ళలాగా వచ్చి కంసుణ్ణీ, అతని తమ్ముణ్ణీ చంపారు. కంసుడు నా అల్లుడు. నా కుమార్తెల వైధవ్యదుఃఖం చూడలేక, నీతో యుద్ధం చెయ్యటానికి వచ్చాను. నువు త్వరగా యుద్ధానికి రా. ఈ భూలోకంలో నువ్వయినా బతికి ఉండాలి, నేనైనా బతికి ఉండాలి; మన ఇద్దరికీ భూమి మీద చోటు లేదు. ఎదట నిలబడి నాతో యుద్ధం చేశావా నిన్ను చంపేస్తాను; యుద్ధం చెయ్యలేక భయపడి పారిపోయావా, పాతాళంలో దూరినా వెంట తరిమి హతమార్చుతాను. నే నెలాటి వాణ్ణో అక్రూరుణ్ణి అడిగినా, నీ తమ్ముడు సాత్యకిని అడిగినా చెబుతారు. రేపే మధురానగరానికి ముట్టడి వేస్తున్నాను. కనక నువు సిద్ధంగా ఉండు."

జరాసంధుడి మాటలుగా దూతలు చెప్పిన ఈ మాటలు విని కృష్ణుడు నవ్వుతూ, "చాలా సంతోషం. నేను ఇన్ని మాటలవాణ్ణి కాను. జరాసంధుడి కొవ్వు అణచటానికి నేనే వద్దామనుకుంటుండగా తానే వచ్చాడు. రానీ, పూర్వం రాక్షసి

అతిక్రమించిన అతని శరీరాన్ని మళ్ళీ రెండుగా చీలుస్తాను. లోకకంటకుడయిన కంసుణ్ణి చంపి ఈ రాజ్యాన్ని ఉగ్రసేనుడికిచ్చినట్టే, జరాసంధుణ్ణి చంపి అతని కొడుక్కు మగధరాజ్యాభిషేకం చేస్తాను," అన్నాడు.

జరాసంధుడి దూతలుగా వచ్చిన రాజకుమారులు కృష్ణుడిచేత సత్కారాలు పొంది వెళ్ళి, అతను చెప్పిన జవాబు జరాసంధుడికి అందించారు.

జరాసంధుడి పేరు వినగానే ఉగ్రసేనుడు మొదలుగా గల యాదవులందరికీ కాళ్ళు చల్లబడ్డాయి. వారిలో వికద్రుడనే యదు వృద్ధుడు, కృష్ణుడితో ఇలా అన్నాడు:

''నాయనా, కమలంలో బ్రహ్మ పుట్టినట్టుగా ఈ యదువంశంలో నువు పుట్టావు. నువ్వుండగా యాదవులకే భయమూ ఉండదు. జరాసంధుడికి అంతులేని రాజుల అండ ఉన్నది. అతను యుక్తిపరుడు, దారుణ స్వభావుడు. అతన్ని యుద్ధంలో ఓడించే శక్తి నీ కొక్కడికే ఉన్నది. కంసుడు బలగర్వితుడై కోటకు ఎలాటి రక్షణలూ లేకుండా ఉంచాడు. ఆయుధాలు సిద్ధంగా లేవు, ఆహార పదార్థాలు అంతకన్నా లేవు. నిజానికిది ఇవాళ దుర్గమే కాదు. అకస్మాత్తుగా శత్రువు వచ్చిపడ్డాడు. అతన్ని ఎదిరించక ఎవరి మానాన వారు చేతులు కట్టుకు కూర్చుంటే ఈ రాష్ట్రం దక్కదు. పూర్వం ముచికుందుడూ, పద్మవంతుడూ, సారసుడూ, హరితుడూ అనే యాదవ రాజులు ఋక్షవంతమూ, వింధ్యమూ, సహ్యమూ అనే పర్వతాలలోనూ, పడమటి సముద్రంలోని దీవులలోనూ శత్రువులకు లొంగని దుర్గాలెన్నో నిర్మించారు. వీరు నలుగురికి పూర్వమే మాధవుడు ఈ మధురను పాలించాడు. ఈనాడు దీనిని బలపరచటం సాధ్యంకాదు. వేరే మరొక దుర్గం ఏర్పాటు చేసుకోవలిసిందే. సూచన ప్రాయంగా చెప్పాను. కర్తవ్యం నువే ఆలోచించు.''





# విరూపాక్షుడి వేణునాదం

ఒకానొక గ్రామంలో, విరూపాక్షుడనే భాగ్యవంతుడుండేవాడు. ఆయనకు అంతో యింతో లలితకళలలో ప్రవేశమున్నది. ఆయన పాటలు రాయడమే కాక, చక్కగా పాడడంలో కూడా నేర్పుగలవాడు.

విరూపాక్షుడు ఎంతో మనసుపడి పద్మావతి అనే యువతిని పెళ్ళిచేసుకున్నాడు. దురదృష్టవశాత్తూ పెళ్ళయిన ఏడాదికే, ఏదో తెలియని జబ్బు చేసి ఆమె మరణించింది. తన మనసులోని బాధను ఆయన, రోజూ విషాదగీతాలుగా ఆలపించేవాడు. అలా చేయడంవల్ల, ఆయన మనసెంతో తేలికపడేది.

విరూపాక్షుడి పాటలు వినడానికి, రోజూ గ్రామంలోనివాళ్ళు కొందరు ఆయన దగ్గిరకు వచ్చేవాళ్ళు. ఆయన పాటవల్ల, తమకూ ఊరట కలుగుతున్నదని అంటూ—వాళ్ళాయనకు తమ సమస్యలు చెప్పుకునేవారు. చాలామంది సమస్యలు డబ్బుతో ముడివడివుండేవి. విరూపాక్షుడు వాళ్ళకు ధనసహాయం చేసేవాడు. ఇది తెలిసి డబ్బు సమస్య వున్నవాళ్ళందరూ, విరూపాక్షుడి ఇంటికి చేరుకోసాగారు. భార్య మరణం కారణంగా విరక్తిభావంలో వున్న విరూపాక్షుడు తన సంపదను అడిగిన వారికి లేదనకుండా దానం చేయసాగాడు. ఇలా కొన్నాళ్ళుగడిచేసరికి, విరూపాక్షుడి ఆస్తి అంతా కరిగిపోయి ఇల్లూ, కట్టుబట్టలతో మిగిలాడు.

ఇక విరూపాక్షుడివద్ద యివ్వడానికేమీ లేదని తెలియగానే, ఆయన ఇంటికొచ్చే వారి సంఖ్య క్రమంగా తగ్గిపోయింది. ఇది విరూపాక్షుడికెంతో బాధకలిగించింది. ఆయన విరక్తితో, ఉన్న ఇంటిని దూరపు బంధువుకు అప్పజెప్పి, తను ఊరు విడిచి తీర్థయాత్రలకు బయల్దేరాడు.

"వసుంధర"



ముందుగా విరూపాక్షుడు కాశీ క్షేత్రాన్ని చేరుకుని, అక్కడ దారిన పోయేవారికి తన పాటలు వినిపించసాగాడు. కానీ ఒక్కరు కూడా ఆయన పాటల పట్ల ఆసక్తి చూపించలేదు. కొందరు మాత్రం ఆయనను బిచ్చగాడనుకుని జాలిపడి డబ్బులిచ్చి, తిండిపెట్టారు.

తన పాట తనకు తప్ప మరెవ్వరికీ ఊరటగానీ, ఆనందంగానీ కలిగించడం లేదని తెలిశాక, విరూపాక్షుడికి జీవితమంటే మరింత విరక్తి పుట్టి గంగానదిలో దూకి ప్రాణాలు తీసుకోబోయాడు.

అప్పుడొక బైరాగి, ఆయనను కాపాడి తనుండే సత్రానికి తీసుకువెళ్ళి, "నాయనా, చూడబోతే నీకెంతో వయసు లేదు. నువ్వు చచ్చిపోవాలనుకున్న కారణం చెప్పు. నాకు చేతనైనసాయం చేస్తాను," అన్నాడు.

విరూపాక్షుడు, బైరాగికి తన కథంతా చెప్పుకుని, "స్వామీ, భార్యపోయిన దుఃఖం నా గొంతులో పలికించిన విషాద సంగీతం, నా మనసుకెంత ఊరటనిచ్చిందో చెప్పలేను! అప్పుడే నాకర్థమైంది— సంగీతం ఎంతటి దుఃఖానికైనా ఊరట కలిగిస్తుందని. నా ఇంటికెందరో, నా పాట వినడానికి వచ్చి ఆనందించేవారు. నా పాటతో అంతమందికి సుఖసంతోషాలు కలిగించానన్న తృప్తి. నాకుండేది. కానీ నావద్ద డబ్బు లేకపోవడంతో, నా పాట వినేవారు లేకపోయారు. ఇప్పుడు నాకు భార్యపోయిందన్న బాధతోపాటు, నేనెవరికీ ఎందుకూ పనికిరానన్న అభిప్రాయం ఏర్పడి జీవితం అంటే మరింత విరక్తి పుట్టింది. నేనెందుకు బతకాలో మీరే చెప్పండి?" అని ప్రశ్నించాడు.

బైరాగి మందహాసంచేసి, "పుట్టిన ప్రతి ప్రాణికీ చావెలాతప్పదో, బ్రతుకూ అలాగే తప్పదు. నీ మనసులోని కోరిక చెప్పు. తీర్చడానికి ప్రయత్నిస్తాను," అన్నాడు.

అందుకు విరూపాక్షుడు, "స్వామీ, ఈ ప్రపంచంలో మనిషికి ఏదో ఒక బాధ



వుండనే వుంటుంది. సమస్త బాధలకూ డబ్బు కారణం అని మనిషి అనుకుంటాడు. కానీ అది నిజం కాదు. మనిషి బాధలను సునాయాసంగా తొలగించి, మనిషికి మనశ్శాంతిని ప్రసాదించడంలో, సంగీతాన్ని మించినది లేదని స్వానుభవంతో నేను గ్రహించాను. అయితే నాకు సంగీత విద్యలో ప్రావీణ్యం లేదు. నా బాధ నా గొంతులో పలికితే, అది నాకు మాత్రమే ఊరట కలిగించేది! అందరికీ ఊరటనిచ్చే అద్భుత సంగీతం వినిపించగలగాలని, నా కోరిక. ఆ సంగీతం విన్నవారు మనశ్శాంతిని పొందాలి తప్ప, నా నుంచి ఏమీ ఆశించకూడదు. సంగీతం వినిపించినందుకు, నేను ప్రజల నుంచి ఎటువంటి ప్రతిఫలమూ ఆశించకూడదు. మీరీ కోరిక తీర్చగలరా, స్వామీ?'' అని అడిగాడు.

బైరాగి, విరూపాక్షుడికి ఒక సంచీ, ఒక వేణువూ యిచ్చి, ''ఈ వేణువు నీనోట పలికినప్పుడు అద్భుత గానం వస్తుంది. అది నీకేమాత్రం మనశ్శాంతిని కలిగించకపోయినా, విన్నవారందరికీ అలౌకికానందాన్నిస్తుంది. వారి ఆనందంతోనే నువ్వు మనశ్శాంతిని పొందాలి. ఇకపోతే— ఈ సంచీ నువ్వు కోరినప్పుడు తిండీ, బట్టా యిస్తూంటుంది. ఆ విధంగా, నీవెవరిపైనా ఆధారపడకుండా, అందరికీ మనశ్శాంతిని కలిగించవచ్చు. ఈ సంచీ, వేణువుల అద్భుతశక్తి, నీకు మాత్రమే ఉపయోగిస్తుంది. ప్రయత్నించినా వీటిని నీనుంచి, ఎవరూ వేరు చేయలేరు,'' అని చెప్పాడు.

విరూపాక్షుడు, ఆ రెండు వస్తువులూ తీసుకుని, ''మహాప్రసాదం, స్వామీ! ఇప్పుడు నేను మా గ్రామానికి తిరిగి వెళ్ళి, నా అభీష్టం నెరవేర్చుకుంటాను,'' అంటూ బైరాగికి రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

బైరాగి, విరూపాక్షుణ్ణి నిండుమనసుతో దీవించి, ''నాయనా, నిస్వార్థబుద్ధితో నువ్వు



ప్రజలకు మనశ్శాంతి కలుగజేయాలనుకుంటున్నావు. నీది సత్సంకల్పం. అది చాలా మెచ్చతగినది. కానీ, ఈ మాయామేయ ప్రపంచంలో, ఏ మనిషిలోనూ సత్సంకల్పం ఎంతో కాలం నిలవదు. సత్సంకల్పం పోయి, నీలో స్వార్థం తల ఎత్తిననాడు, ఈ సంచీ, వేణువూ తమ అద్భుతశక్తులను కోల్పోతాయి. స్వార్థం కాక న్యాయమైన కారణంగా, నీవు నీ సంకల్పాన్ని మార్చుకుంటే—అప్పుడు వేణువు నీచుట్టూ వున్నవారికి కాక, నీకు మాత్రమే ఆనందాన్నిచ్చే సంగీతం పలుకుతుంది. సంచీ, పోయిన నీ ఆస్తినంతా తిరిగి యిస్తుంది. అప్పుడు నీవు నూతనానందంతో కొత్త జీవితం ప్రారంభిస్తావు.'' అని చెప్పాడు.

విరూపాక్షుడు, బైరాగివద్ద శెలవు తీసుకుని, తన గ్రామానికి తిరిగి వచ్చాడు. ఆరంభంలో ఆయన నెవరూ పట్టించుకోలేదు. కానీ కొద్ది రోజుల్లోనే, విరూపాక్షుడి వేణునాదానికి ఎక్కడలేని పేరూ వచ్చింది. గ్రామస్థు లదివింటూ మైమరచి పోయేవారు.

అలా మాసం రోజులు గడిచేసరికి, విరూపాక్షుడికి గ్రామంలోనే కాక, చుట్టుపక్కల గ్రామాల్లో కూడా పేరొచ్చింది. శారీరకంగా, మానసికంగా జబ్బులతో బాధపడేవాళ్లూ, వికలాంగులూ, వృద్ధులూ, ఆర్థిక సమస్యలున్నవాళ్ళు—ఇలా ఒకరేమిటి, ఎందరో ఆయన వేణునాదం విని మనశ్శాంతి పొందేవారు. తన వేణునాదం తన కేమాత్రమూ ఆనందం కలిగించకపోయినా, ఎందరికో అది కలిగించే సంతోషాన్ని తలుచుకుని తృప్తిపొందేవాడు, విరూపాక్షుడు.

అయితే, యీ పరిస్థితి ఎంతోకాలం సాగలేదు. విరక్తిభారంతో తీర్థయాత్రలకని వెళ్ళిన విరూపాక్షుడు, మళ్ళీ తిరిగి రాగలడని ఆయన దూరపుబంధువు అనుకోలేదు. ఇక ఎన్నటికీ విరూపాక్షుడి యిల్లు తనదే అనుకుంటున్న సమయంలో,



ఆయన తిరిగివచ్చాడు. విరూపాక్షుడిలో విరక్తిభావం కలిగించి, మళ్ళీ గ్రామం నుంచి పంపివేయాలని, ఆ దూరపు బంధువుఆలోచించి, ప్రతిరోజూ గ్రామస్థుల మధ్య ఆయనకు వ్యతిరేకంగా ప్రచారం ప్రారంభించాడు.

అదివిన్న గ్రామస్థులు—ఏదో స్వప్రయోజనం లేకుండా విరూపాక్షుడు అందరికీ సంగీతాన్ని వినిపించడనీ, అదేమిటో తెలుసుకోవాలనీ అనుకోసాగారు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక, ఒక రోజున విరూపాక్షుడు వేణునాదం వినిపించడానికి అందరినీ సమావేశపరిచిన సందర్భంలో, ఆయన దూరపుబంధువు లేచి, "ఏదో దురాలోచనతోనూ, స్వార్థపూరితమైన ప్రయోజనంతోనూ, నువ్వందరికీ యిలా సంగీతం వినిపిస్తున్నావని, గ్రామంలో అందరూ అనుకుంటున్నారు. అదెంత వరకు నిజమో నాకు తెలియదు. కానీ ఏ పనికైనా ఏదో ఒక ప్రయోజనం వుండాలి కదా! అదేమిటో అందరికీ చెప్పు," అన్నాడు.

"పదిమందికీ సంతోషాన్నిచ్చే పని, నాకు మనశ్శాంతినిస్తుంది. అంతకుమించి నేనాశించే ప్రయోజనం ఏమీ లేదు," అన్నాడు విరూపాక్షుడు, బంధువు అన్న దానికి బాధపడుతూ.

"సంగీతవిద్యలో నువ్వు గొప్పవాడివనుకుంటే, నీ విద్యను రాజాస్థానాల్లో ప్రదర్శించవచ్చునుగదా! ఇక్కడెందుకు ప్రదర్శిస్తున్నావు?" అని అడిగాడు దూరపుబంధువు.

విరూపాక్షుడు ఒకక్షణం ఆగి, "మనశ్శాంతినిచ్చే విద్య సత్కారాలను వెతుక్కుంటూ వెళ్ళదు. మనశ్శాంతిని కోరేవాడు రాజైనా, నన్ను వెతుక్కుంటూ రావలసిందే," అన్నాడు.

అప్పుడా బంధువు జనంతో, "చూశారా! విరూపాక్షుడి దంతా అహంకారం! మనమంతా గతిలేక ఆయనసంగీతం వింటున్నామట," అని చెప్పాడు.



గ్రామస్థులెవ్వరూ ఏమీ మాట్లాడలేదు. అప్పుడు విరూపాక్షుడి దూరపుబంధువు మరింతగా రెచ్చిపోయి, "అహంకారాన్ని సహించేవాళ్ళే, విరూపాక్షుడి సంగీతం వింటారు. తనేమన్నా సహించి, తన సంగీతం వింటారని విరూపాక్షుడు అమర్యాదకరంగా మాట్లాడుతున్నాడు," అన్నాడు.

అప్పటికీ గ్రామస్థులెవరూ మాట్లాడలేదు.

అప్పుడు విరూపాక్షుడు చటుక్కున లేచి నిలబడి, "మీ అందరిదీ ఒకే అభిప్రాయం అయితే, యీ క్షణం నుంచే నా వేణునాదం మీకు వినిపించను," అన్నాడు.

గ్రామస్థులెవరూ ఏమీ మాట్లాడలేదు. విరూపాక్షుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మర్నాడు విరూపాక్షుడి దూరపు బంధువు, విరూపాక్షుడి దగ్గిరకు వెళ్ళి, "నన్ను క్షమించు! ఊరివాళ్ళ కుళ్ళుబుద్ధి బయటపెట్టాలని, నేనలా నలుగురిలో మాట్లాడానే తప్ప, నీవంటే నాకెంతో గౌరవం. నీవు మళ్ళీ ఊరువదిలిపోతే, నా మీద దయ తలచి నీ ఇల్లు నా పరం చెయ్యి. చాలా పేదవాణ్ణి; పిల్లలు కలవాణ్ణి," అన్నాడు.

విరూపాక్షుడాయనకు బదులివ్వలేదు.

కొద్ది రోజులు గడిచాక, శ్రీకరుడనేవాడు విరూపాక్షుడింటికి వెళ్ళి, "అయ్యా, మీ దూరపుబంధువు దుష్టబుద్ధితో, దురాలోచనతో, ఆ రోజున అలా మాట్లాడాడు. ఊళ్ళోవాళ్ళెవరూ ఆయన మాట నమ్మలేదు. మీ పాటంటే అందరికీ యిష్టం. నా మాట మీద నమ్మకముంచి, ఊళ్ళోవాళ్ళ అందరిళ్ళకూ వెళ్ళి, వారివారి అభిప్రాయాలు తెలుసుకోండి. నేను చెప్పింది నిజమైతే, మీ వేణునాదాన్ని మళ్లీ మా అందరికీ వినిపించండి," అన్నాడు.

విరూపాక్షుడు, శ్రీకరుడితో బయల్దేరి గ్రామస్థులందర్నీ విడివిడిగా కలుసుకున్నాడు. ప్రతి ఒక్కరూ అతడి వేణు

నాదాన్ని తరచుగా వినాలన్న కోరికను వెలిబుచ్చారు.

"విన్నారుకదా! ఈ రోజే తమరు మళ్ళీ వేణువును, మా అందరిముందూ పలికించాలి," అన్నాడు శ్రీకరుడు.

విరూపాక్షుడు చప్పున తన సంచీలోంచి వేణువును తీసి, ఒక పాటపాడి శ్రీకరుడికి వినిపించి, "ఎలా వున్నది?" అని అడిగాడు.

శ్రీకరుడు ఆపాటవిని ఎంతగానో ఆశ్చర్యపోయి, "అతి సామాన్యంగా వున్నది," అన్నాడు.

"నాకు అద్భుతంగా వున్నది. ఇక మీదట యీ వేణువు నా కొక్కడికి మాత్రమే ఆనందాన్నిస్తుంది," అన్నాడు విరూపాక్షుడు.

శ్రీకరుడికి ఏం జరిగిందీ అర్థం కాలేదు. అప్పుడు విరూపాక్షుడు తనకు బైరాగి చెప్పినదంతా శ్రీకరుడికి చెప్పి, "నిజంగా గ్రామస్థులు, నా వేణునాదాన్ని మనస్ఫూర్తిగా కోరివుంటే—ఆనాడు నా దూరపుబంధువు నన్ను నిలదీసి అర్థంలేని ఆరోపణలు చేస్తూంటే, అతణ్ణి గట్టిగా మందలించి వుండవలసింది. వాళ్ళలా చేయలేదు. అందువల్ల వాళ్ళు, యీ అద్భుత సంగీతం వినేందుకు అర్హులు కారు. ఏ మనిషయితే, తన కళ్ళముందు జరిగే అన్యాయాన్ని ప్రతిఘటించి, తనకు దూరమవుతున్న అదృష్టాన్ని తరిమిపట్టుకోగలడో—అతడే అన్ని సత్కారాలకూ అర్హుడు!" అన్నాడు.

అందరూ కోరినప్పటికీ, వేణునాదాన్ని మానివేయడంలో విరూపాక్షుడి స్వార్థం ఏమీ లేదని, శ్రీకరుడికి అర్థమయింది. అతడు విచారంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత విరూపాక్షుడు, గ్రామానికి దూరంగా ఒక పర్ణశాల నిర్మించుకుని, బైరాగి యిచ్చిన సంచీ మహిమతో ధనం గడిస్తూ, దాన్ని పేదలకోసం, బీద విద్యార్థుల విద్యాభివృద్ధికీ వినియోగించసాగాడు.





# పిశాచాలజేగంట

పూర్వం చీనాలో ఒక అన్నా, ఒక తమ్ముడూ ఉండేవారు. కావటానికి వాళ్ళు ఒకతల్లి పిల్లలే అయినా వాళ్ళ బుద్ధులలో ఎంతో వ్యత్యాసం ఉండేది.

అన్న చాలా చెడ్డవాడయితే, తమ్ముడు ఎంతో బుద్ధిమంతుడు.

తండ్రి పోగానే అన్న డబ్బంతా, తన సొంతం చేసుకుని, దాన్ని హెచ్చు వడ్డీలకు అప్పులిచ్చి ధనవంతుడయాడు. తమ్ముడు అన్నకు ఎదురుచెప్పక, గ్రామంలోవాళ్ళకు రకరకాలుగా సహాయపడుతూ, అస్తమానం శ్రమ చేస్తూనో, ఇతరుల సహాయంతోనో పొట్ట గడుపుకుంటున్నాడు.

ఒకనాడు తమ్ముడు చక్కెర పాకం, కావడి వేసుకుని పొరుగూరిలో ఇచ్చి రావలిసివచ్చింది. దారి కొండదారి. అంతకుముందే వాన కురియటంచేత కొండచెరియ జారుడుగా ఉన్నది. తమ్ముడు కావడి వేసుకుని కొండదారి వెంట ఎక్కుతూండగా కాలు జారింది. వాడు పాకం కడవలతోసహా పల్లానికి దొర్లాడు. కడవలలో ఉన్న పాకమంతా వాడి ఒంటినిండా పట్టి గట్టిగా బిగుసుకున్నది.

వాడు పడిన చోటునుంచి లేచేలోపుగా కొన్ని పిశాచాలు అటుగా వచ్చి, "అమ్మయ్యో! ఎంత పెద్ద చక్కెర బొమ్మో!" అని కేకలు పెట్టాయి. కొన్ని పిశాచాలు అప్పటికప్పుడే ఆ చక్కెర బొమ్మను తినెయ్యాలనుకున్నాయి. కాని అంత పెద్ద చక్కెరబొమ్మను ఒక్క పాళంగా తినటం సాధ్యం కాదు. అందుచేత పిశాచాలన్నీ సాయంపట్టి తమ్ముణ్ణి తమ గుహకు తీసుకుపోయి, ఒక రాతి మీద పడుకోబెట్టాయి.

చీనా జానపద కథ

తరవాత పిశాచాలు ఆ చక్కెరబొమ్మ చుట్టూ గుంపుగా చేరి, కొన్ని చక్కెర పెళ్ళలు గిల్లుకు తిన్నాయి.

ఇంతలో ఒక కొమ్ములు గల పిశాచం, "ఇక చాలు. చక్కెర జాస్తిగా తింటే అన్నం సయించదు. తిండి తిని మనం ఆడుకోవటానికి పోవాలి. మన జేగంట పట్టుకురండి!" అన్నది.

తమ్ముడు అంతసేపూ కదలకమెదలక చక్కెర బొమ్మలాగే ఉండిపోయాడు. తాను మనిషి అని తెలిస్తే ఆ పిశాచాలు తనను బతకనివ్వక నానా హింసా పెడతాయని వాడికి తెలుసు.

నెత్తిన కొమ్ములు గల పిశాచం జేగంట వాయించేసరికల్లా, గారడీలాగా రకరకాల ఆహారపదార్థాలు వచ్చేశాయి.

ఆ పదార్థాల ఘుమాయింపు ముక్కుకు తగిలేసరికి తమ్ముడికి నోరూరి, చెడ్డ ఆకలి అయింది. పిశాచాలు ఆ పదార్థాలన్నిటినీ సంతోషంతో తిని, జేగంట ఒకచోట భద్రంగా దాచి, గంతులేసుకుంటూ ఆడుకోవటానికి వెళ్ళిపోయాయి.

గుహలో ఇంకెవరూ లేకుండా పోయాక, తమ్ముడు రాతిపైనుంచి చెంగున లేచి, దాచి ఉన్న చోటినుంచి జేగంట సంగ్రహించి, దాన్ని తన చొక్కాలో దాచుకుని, కాలి నత్తువకొద్దీ ఇంటికి పరిగెత్తాడు.



ఆ తరవాత తమ్ముడికి భోజనం సమస్య తీరిపోయింది. వాడు కావాలన్నప్పుడల్లా జేగంట తీసుకుని వాయిస్తేచాలు, క్షణాలలో వాడి ముందు మృష్టాన్నం సిద్ధంగా ఉండేది.

తమ్ముడికి పట్టిన ఈ అదృష్టం గురించి వివరాలు తెలియగానే, అన్నకు పట్టరాని అసూయ పుట్టుకొచ్చింది. తమ్ముడి లాగా చేస్తే తనకూ అలాటి అదృష్టం పడుతుందని వాడు కూడా ఒక చక్కెరపాకం కావడి భుజాన వేసుకుని అదే కొండ దారిన బయలుదేరాడు. ఈసారి బురదా, జారుడూ లేవు. అందుచేత అన్న కావాలని పడి పల్లానికి దొర్లి పాకం ఒళ్ళంతా



పూసుకుని పడుకున్నాడు. కొంతసేపటికి పిశాచాలు అటుగా వచ్చాయి. అవి అన్నను చూసి, ''పారిపోయిన చక్కెరమనిషి ఇడుగో! వీణ్ణి మన గుహకు తీసుకుపోయి ఏం చెయ్యాలో అది చేద్దాం,'' అని అరిచాయి.

ఈ మాటలు విని అన్న, తన పంట పండిందిగదా అనుకుని సంతోషించాడు.

పిశాచాలు అన్నను భుజంమీద వేసుకుని, ఎత్తుకుపోయి తమ గుహలోని రాతి మీదికి చేర్చాయి.

కొమ్ముల పిశాచం, ''కిందటిసారి ఈ చక్కెరమనిషి మన జేగంట దొంగిలించుకుపోయాడు. అందుచేత ఈసారి మనం వీణ్ణి భాండంలో కొంచెం ఉడకబెట్టి ఉంచుదాం!'' అన్నది.

పిశాచాలు అన్నను ఒక ఖాళీ భాండంలో పెట్టి, నీళ్ళుపోసి, భాండంకింద మంట చేశాయి. భాండంలో నీరు కాగి వేడి ఎక్కుతున్న కొద్దీ అన్నకు బాధ హెచ్చింది. చివరకు వాడు వేడి భరించలేక, భాండంలో నుంచి బయటికి దూకి గుహ బయటికి పరిగెత్తాడు. కాని వాడు ఎంతో దూరం పోక మునుపే పిశాచాలు వెంటపడి వాణ్ణి పట్టుకున్నాయి.

కొమ్ముల పిశాచం మిగిలిన పిశాచాలతో, ''వీడు మళ్ళీ మనకు చిక్కుతాడో లేదో, ఎప్పటికీ జ్ఞాపకం ఉండేటట్టుగా వీడికి తగిన శిక్షచేసి పంపుదాం!'' అన్నది.

తరవాత ఒక్కొక్క పిశాచమే వచ్చి అన్న ముక్కు పట్టుకుని ఒక అడుగు పొడుగు సాగదీసింది. అన్న ముక్కు ఏడు అడుగుల పొడుగు సాగింది. ఆ తరవాత పిశాచాలు వాణ్ణి గుహలో నుంచి విసిరి బయటపారేశాయి.

చావు తప్పి కన్ను లొట్టపోయినట్టుగా అన్న తన ముక్కును చుట్టచుట్టి చేతిలో పట్టుకుని, బతుకు జీవుడా అంటూ తన కొంపకు చేరాడు.

తన మొగుడు పిశాచాల దగ్గిర దొంగిలించి ఏదో మహత్తు గల వస్తువు తెస్తాడని



ఆశతో ఎదురుచూస్తున్న అన్న భార్య, తన భర్త పిలుపు వినగానే తలుపు తెరిచి బయటికి వచ్చింది.

అన్న బాధతో, "నా ముక్కుమీద నిలబడ్డావు, తొలగవే!" అని ఇల్లు అదిరేలా కేకపెట్టాడు.

"అంతా చోద్యం! మీ ముక్కుమీద నేనెలా నిలబడతానూ!" అంటూ ఆవిడ భర్తకేసి పరీక్షగా చూసి నిర్ఘాంతపోయింది.

అన్న తన భార్యకు జరిగినదంతా చెప్పాడు. ఆవిడ అంతా విని నిట్టూర్చి, "పిశాచాలు చేసినదానికి పిశాచాల దగ్గిరే విరుగుడు ఉంటుంది. అయినా నేను వెళ్ళి మీ తమ్ముణ్ణి సలహా అడిగి వస్తాను!" అంటూ బయలుదేరింది.

వదినెగారు తనకోసం వచ్చేసరికి తమ్ముడు నాగలి కట్టుకుని పొలానికి పోబోతున్నాడు. వాడు చిత్రమైన మనిషి. తనవద్ద ఉన్న జేగంట ఒక్క తిండేగాక ఇంకా ఏది కావలిసినా ఇస్తుందని వాడు అదివరకే తెలుసుకున్నాడు. అయినప్పటికీ వాడు పని లేకుండా సోమరి బతుకు బతకటం ఇష్టంలేక, ఆ గంట సహాయంతో తనకు కావలిసిన వ్యవసాయ పరికరాలు మాత్రం సంపాదించుకుని తరవాత గంటను పెట్టెలో దాచిపెట్టేసి, కష్టించి జీవిస్తున్నాడు.

"ఏం, వదినా, ఇలా వచ్చావు?" అని వాడు అన్న భార్యను అడిగాడు.

ఆవిడ కంటతడి పెట్టుకుంటూ, అన్నకు పిశాచాలు చేసిన శిక్ష గురించి వివరంగా చెప్పింది.

తమ్ముడు అంతా విని, "నేను పిశాచాలుండే కొండప్రాంతానికి మరొకసారి వెళ్ళి అన్న ముక్కు సరిచేసే మార్గం ఏమైనా ఉందేమో తెలుసుకు వస్తాను," అన్నాడు.

ఆ రోజు పిశాచాలు తిండి తినే వేళకు తమ్ముడు అవి ఉండే గుహను చేరుకుని, లోపల పిశాచాలు అడుకునే మాటలను శ్రద్ధగా ఆలకించాడు.

మాటల మధ్యను ఒక పిల్ల పిశాచం, "పాపం, ఆ చక్కెరమనిషి ముక్కు ఏమయిందో!" అన్నది.

"వాడికి బుద్ధి ఉంటే దాన్ని సరిచేసుకునే సాధనం వాడిదగ్గిరే ఉన్నది. జేగంట మీద ఒక్కొక్క దెబ్బ కొట్టి, 'తగ్గు! తగ్గు!' అంటుంటే కొంతసేపటికల్లా వాడి ఏడు అడుగుల పొడుగు ముక్కు కొంచెం కొంచెమే తగ్గిపోతుంది," అన్నది కొమ్ముల పిశాచం.

ఈ మాట విన్నాక తమ్ముడు అక్కడ మరి నిలవక సరాసరి ఇంటికి పరిగెత్తుకొచ్చాడు; తన పెట్టెలోనుంచి పిశాచాల జేగంట తీసుకుని తన అన్న ఇంటికి వెళ్ళాడు.

"ఊc, ఊc! మీ అన్న ముక్కు చప్పున మామూలుగా చేసెయ్యి!" అని వదినె అతన్ని తొందర పెట్టింది.

తమ్ముడు గంట మీద ఒక దెబ్బకొట్టి, అన్న ముక్కుకేసి చూస్తూ, "తగ్గు!" అన్నాడు.

అన్న ముక్కు మూడంగుళాలు తగ్గింది.

వాడు మరొక దెబ్బకొట్టి మళ్ళీ "తగ్గు!" అన్నాడు. అది మళ్ళీ మూడంగుళాలు తగ్గింది.

ఒక పావుగంట గడిచేసరికి అన్న ముక్కు నాలుగడుగుల పొడుగుమాత్రమే ఉన్నది. కాని అన్న భార్యకు ఆ పావుగంటా ఒక యుగం లాగా తోచింది. తమ్ముడు తెలివితక్కువవాడై తాత్సారం చేస్తున్నాడని ఆమెకు తోచింది.

ఆవిడ ఇక భరించలేక తమ్ముడి చేతిలోనుంచి జేగంటా, శీలా లాగేసుకుని, "తగ్గు, తగ్గు, తగ్గు....!" అంటూ గంటను గబగబా బాదసాగింది.

ఈ బాదుడు ఫలితంగా గంట కాస్తా పగిలి ముక్కలైపోయింది. ఆసరికే అన్న ముక్కు తగ్గిపోవటమే గాక అసలు ముక్కే లేకుండాపోయింది. భార్య బుద్ధి తక్కువవల్లా, తొందరపాటువల్లా వాడు శాశ్వతంగా ముక్కిడి అయిపోయాడు!




పురుగులు, పురుగులు, పురుగులు
ఇతర జంతువులకన్నా, ఎర్ర ఉడత ఒంటి మీద ఎక్కువ పురుగులు వుంటాయని చెబుతారు. ఒక్క ఉడత మీదే 13,000 క్రిములు ఉన్నట్టు తెలియవచ్చింది!


ఎగరడంలో నేర్పరి!
ఆల్బట్రాస్ పక్షి, ఆరు రోజులవరకు రెక్కలు ఆడించకుండా గాలిలో ప్రయాణం చేయగలదు!


అమెజాన్ నదీజలం!
ప్రపంచంలో అమెజాన్ నదికి తరవాతి పెద్ద నదులుగా చెప్పబడే ఎనిమిది నదులలో వున్న మొత్తం నీళ్ళకన్నా, అమెజాన్ నదిలో వున్న నీళ్ళ పరిమాణం ఎక్కువ!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Bishan Maheshwari



Ravindra S. Kamboj

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అగస్టు నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: వెలుగునీడల కలయిక! రెండవ ఫోటో: నీ బొమ్మ తీస్తా—కదలక!

పంపినవారు: ఆర్. ఆర్. కుమారి, అభిరామపురం, మద్రాసు-18.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


దాగుడు మూతలు ఆడేవాళ్ళు
ఈ రణజాని ఒడించాలని చూసేవాళ్ళు
వాళ్ళందరితో నాకేం పనింక
చేస్తాగా నే కొత్తవింత ఏదో ఇంక.
నాఎకో పెన్నుల సెట్టు
కాలక్షేపాన్నదే తెచ్చి పెట్టు
ఇలావేస్తా నేగోడమీద బొమ్మ గొలుసుల బొమ్మ
అలా గీసేస్తా నే రెండుజడల అమ్మాయి బొమ్మ
ఎకో పచ్చ ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓసెట్
ఉచితం!
కలరింగ్ ఫోల్డర్
EKCO
ఎకో
స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!
ప్రెసిషన్ రైటింగ్ పాయింట్స్ (ప్రైవేట్) లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలే పార్లే (ఈస్ట్), బొంబాయి 400 057.
Tikaya-E-1-86-TEL

